శ్రీ

# హనుమద్రామసంగ్రామము.

అను

(శ్రీరామాంజనేయుల యుద్ధము.)

ఇది

అభినవరాఘవము, ప్రసన్నయాదవ, పాండవాజ్ఞాతవాసము,

విజయబొబ్బిలి, ఉషాపరిణయము, సారంగధర,

మహాభారతసారము రచించిన

శ్రీయుత ద్రోణంరాజు సీతారామారావుగారిచే

రచింపఁబడి



భీమవరోలు బుక్కుసెల్లర్

కురుకూరి సుబ్బారావుచే

ప్రకటింపఁబడియె.



కాకినాడః

స్కేప్ అండ్ కో., ముద్రాక్షరశాల న్ముద్రితము.

1922.

[వెల రు 0—10—0 లు.

# ఈనాటకమందు వచ్చు పాత్రములు.

### పురుషులు.

యయాతి—సూర్యవంశపురాజు.

విశారదుఁడు—మంత్రి.

సుశర్మ—చెలికాఁడు.

రాముఁడు—సాకేతపురాధీశుఁడు.

లక్ష్మణుఁడు—రాముని తమ్ముఁడు.

విశ్వామిత్రుఁడు<br>వసిష్ఠుఁడు<br>నారదుఁడు<br>దూర్వాసుఁడు — మునులు

హనుమంతుఁడు<br>సుగ్రీవుఁడు<br>అంగదుఁడు — వానరులు.

పరమేశ్వరుఁడు—

### స్త్రీలు

చారుమతి—యయాతి భార్య.





శ్రీ

# హనుమద్రామ సంగ్రామము.






నాంది.

మ. చిరభాగ్యోదయ ప్రాప్తిహేతువు శుభ ♦ శ్రీ కారణంబున్ సత్కవీ
శ్వర శ్లాఘాభరణంబు మౌనివందిత ముమా ♦ పద్మాయతాక్షీమనో
హరసంసేవిత మార్యరక్షణము, ను ♦ ద్యచ్ఛౌతు సంహార మా
వరరామ ప్రభుపుణ్య పాదరజమే ♦ పాలించు మిమ్మెప్పుడున్.

[నాంద్యంతమున]

సూత —(ప్రవేశించి) అతివిస్తరం బెందుకు? కాలహరణంబునకీసభ్యు
లోర్వజాలరుగదా. ప్రక్కంజూచి పారిపార్శ్వకా! యీవొక
సారి యిటురమ్ము.

పా —ఆర్యా ! యేమిసెలవు?

సూత —ఇంకను నేమిసెల వని యడుగుచుంటివా.

తే. గీ. నూతనంబైన చరితంబు ♦ ఖ్యాతిమీఱ
నాడువారలమంచును ♦ నాసతోడ
వచ్చియున్నారు సభ్యులు ♦ వారిగంటె
వీరి రంజింపజేయుట ♦ వేడ్కగాదె.

పారి—నాటకప్రదర్శనాకౌశలురగు తమకిదియసాధ్యమైన కార్యమా?

సూత —ఓయీ! అట్లనవలదు. ఎట్టిసమర్థునకైనను, తాబూనిన కా
ర్యము కొనసాగునవఱకు, భయముగనే యుండును.

పారి.—అట్లయిన మనమిప్పుడేప దర్శనంబున సభ్యుల నానందపఱు
వలయును

సూత —ఇటీవల "హనుమద్రామ సంగ్రామ" మను నూతననాట
మొకటి వెలువడినది. అయ్యది ప దర్శించినచో బాగుండున
తలంచితిని.

పారి.—నాటకముయొక్క గుణాగుణములు మీకు దెలియవలయునుగా
ని యల్పజ్ఞానవయస్కుడ నగునా కేమి తెలియును. అయ్యా
మఱచితి. నాటకము పేరు హనుమద్రా మసంగ్రామమా! వి
ముగా నున్నదే. ఇందు రామునకును హనుమంతునకు పోర
టము జరుగునా యేమి?

సూత —నాటకనామమే యాయ మునుసూచించుచున్నదికదా. నీ
తలంచినట్లు యయాతియను నొక రాజచంద్రుని కారణం
నిది సంభవించును.

పారి.—అట్లయిన నీనాటకము సభ్యుల వీనులకు వింత గొలిపితీరు
కరుణింబూని నాటక ప ణేతనామము గూడ దెలిపి ధన్యు
జేయుము.

సూత —నాటకకర్త మనకు జిరపరిచితుండే.

శా. నానాదిక్తటగేయ కీర్తియగు ద్రో ♦ ణంరాజ వంశోద్భవుం
డౌ నారాయణ రాయనందనుడు శ్రీ ♦ శాంఘ్రిద్వ యీాభక్తి
ధానుండున్ విబుధాను వర్తనుడు శ్రీ ♦ తారామనామాంకు డెం
తో నైపుణ్యత వా సె సత్కృతులు సం ♦ తోషింపస్వాంతంబులన్

తెలిసినదా. ఇంక మనము జాగుసేయక ప ద ర్శనము పా రంభింతము
రమ్ము. నిష్క్రమింతురు.)

ఇది ప స్తావన.





శ్రీ

# హనుమద్రామ సంగ్రామము.

## ప్రథమాంకము.

[యయాతియు, మంత్రి యగు విశారదుండును ప్రవేశించుచున్నారు.]

యయా—మంత్రి వర్యా! విశారదా!

తే. గీ. మఖములన్నిటియందును ♦ మహీని దురగ
యాగమే గొప్ప; యది చేసి ♦ యలరువారు
నిందిరామనోహరుకృప ♦ నందగలిగి
చెలగుదురటంచు మౌనులు ♦ సెప్పుచుందు.

సమస్తవాంఛితా ఫలప్రదంబును, నిఖిలపాపక్షయంబును, నగు నాయశ్వమేధయాగంబు నేను జేయసమకట్టి మునివర్యులచేత దద్విధానంబు నెఱింగి యందులకు గావలయు వస్తుసామగ్రిని గూర్పుమని నీకు దెలిపియుంటినిగదా?

విశా—దేవర యాజ్ఞను శిరంబున ధరించి, సమస్తంబును జాగ్రత చేయించితివి. ఇంక యాగశాలలు మాత్రము నిర్మింపవలసియున్నది. వానికై తగు ప్రదేశంబు నారయుచుంటిని.

యయా—మనపురపరిసరప్రాంతారణ్యంబున దుష్టసత్వంబుల నుక్కడగించి యయ్యరణ్యంబున గొంతభాగంబు ఛేదించి యచ్చట నిర్మింప జేయుము.

విశా—ఆ జ్ఞనుసరించెదగాక.

యయా—నేను యాగమాచరించువాడనే కాని, భారమంతయు నీభుజస్కంధమునందు వహింపవలయును

విశా—మహారాజా! సేవకునితో నిట్లు చెప్పవలెనా.

సేవ—(ప్రవేశించి) దేవా! దేవరదర్శనార్థమై వసిష్ఠాత్రిగస్త్యదుర్వాస విశ్వామిత్ర నారదాదిమునీంద్రులేతెంచి నిరీక్షించియున్నారు.

యయా—ఏమీ! మునివర్యులందఱును వచ్చియున్నారా! ఏమి నాభాగ్యము. (మంత్రి నిజూచి) మంత్రీ! మన మామహాత్ముల కెదురేగి తోడ్కొని రావలయును.

[ఆసనములనుండి లేచి యించుక నడవగా మునులు ప్రవేశింతురు.

యయా—తాపసోత్తములారా! వందనములు.

మునులు—కల్యాణమగుంగాక!

యయా—మునివర్యులారా! ఈ యాసనంబుల నధిష్ఠింపుఁడు.

ముని—(ఆసీనులగుదురు)

ఉ. తాపసచంద్రులార! కడు ♦ ధన్యతఁగాంచెను నాదుజన్మ; మీ
రీపగిదిన్ గృపారసము ♦ నేతయు నాపయి జాలజేసినన్
బాపములెల్ల బాయుదగు ♦ మార్గము జూపగగల్గినారికన్
శ్రీపతికిన్ బ్రియంబుగను ♦ జెచ్చెర యాగము జేతు ధాత్రిలోన్.

తాపసోత్తములారా! ఈదీనునియెడలఁ గృపబూని కృతార్థునిజేయదలంచి వచ్చిన మీపాదపంకేరుహంబుల కనేక నమస్కారము లాచరించుచున్నాను.

తే. గీ. మీదుపదధూళి సోకగా ♦ నాదు భవన
మెట్టిపుణ్యంబుగావించి ♦ యొగడియుండె
పూర్వజన్మంబునందున ♦ బుణ్యులార
కంటి మిము నేను ధన్యత ♦ గంటిగాదె.

వసి——రాజా!

తే. గీ. అఖిల దానవ తమ్ముల ♦ కాటపట్టు
నాశి తావనంబునకును ♦ నమరభూజ
మట్టి యిక్ష్వాకువంశంబు ♦ నందు జన్మ
మంది యశమందుచున్నాడ ♦ నవనిపాల.

అగ——

మ. జలజాతాప్తకులాబ్ధి పూర్ణశశివై ♦ జన్మించి ధర్మంబు జె
న్నలరన్ బాలనమాచరింపుచు సము ♦ ద్యత్కీర్తినింగాంచుచున్
ఖలులన్ దుష్టుల నీచమార్గపరులన్ ♦ దండించు నీచేతనున్
వడి యాగం బొనరింపజేయుటది మా ♦ భాగ్యంబు రాజోత్తమా.

అత్రి ——తే. గీ. నిరతసత వ్రతంబున ♦ వరలుచుండి
యంబుజాక్షు పదములు మ ♦ నంబునందు
నిలిపి సేవించునట్టి భూ ♦ నేతలెల్ల
మాకు మిత్రు లౌదురు సుమా ♦ మానవేంద .

దుర్వా——తే.గీ. యాగములు జరుగు స్థలము ♦ లాటపట్లు
మాధవపదాబ్జచింతనుల్ ♦ పరమహితులు
భూరిహరికథాశ్రవణంబు ♦ భోజనంబు
గాగ జరియింపుచుందుము ♦ క్ష్మాతలేశ.

విశ్వా——

ఉ. అంతటి యశ్వమేధము ధ ♦ రాధిపులెల్లరు మోదమొందగా
స్వాంతమునందు శ్రీ ధవుడు ♦ సంతసమొందగ జేయనెంచి భా

స్వాంతకులవ సిద్ధి కాక ♦ వన్నెను బెట్టుచునుంటివీవు భూ
కాంత! త్వదీయకీర్తి తి జ ♦ గంబులయందున వెల్గిమించ దే.

నార—రాజేంద్రా ! పుట్టినభూపతులందఱును యాగంబు సేయురు. ఎవ్వరో నూటికొక్కరు సేయుచుందురు. నీవు రాకృతసుకృతంబు నం జేసి, నీకీకోర్కె జనించినది. నీయుద మంబునకు సంతసించి తపోధనులందఱు నేతెంచియున్నారు. వరిపాదారవిందసందర్శనంబున నీజన్మము ధన్యతవహించినది. కావున యథావిధిగ వీరిని నర్ఘ్యపాద్యాదివిధులం బూజింపుము. తనలో) ఈమధ్య నెక్కడను గలహంబు సంప్రాప్తించియుండకపోవుటచేత నాచిత్తంబంతయు నదియొకతీరుగనున్నది. కలహములేనిదినంబు నాకుపవాసంబుతో సమానము. ఇప్పుడీసభయందే దేని కలహము వాటిల్ల జేసి, నాపొట్ట నింపుకొనవలెను.

(ఆలోచించుచున్నాడు.)

యయా—(మంత్రి ంజూచి) మంత్రీ ! ఈతాపసోత్తముల బూజింపవలయునుగావున బంగారుకలశముతో విమలసలిలంబును దెమ్ము.

మంత్రి—చిత్తము (నిష్క్రమించి వెంటనే. కలశముతో నుదకము దెచ్చి యిచ్చును.)

యయా—(నీరమునందుకొని మొదట వసిష్ఠుండు మొదలగువారి పాదంబులను గడుగుచున్నాడు.)

నార—(తనలో) మంచియుపాయము తోచినది. (విశ్వామిత్రు నితో రహస్యముగ) విశ్వామిత్రా! చూచితివా? ఈయయాతిమర్యాద నిన్ను బరాభవించుటకే యిక్కడకు బిలచినాడు. కాకున్న చో నపరబ్రహ్మవగు నిన్ను వీడి తొలుత వసిష్ఠుని బూజించునా! నీకిది బాగున్నదేమోకాని నాకుమాత్రము బా-లేదు.

నీవీసమయంబున పానముదాల్చి యూరకుంటివే ని శక్తుని గబరిగణింతురు.

వసి—(తనలో) కలహభోజనుండేదియో విశ్వామిత్రు నకు బోధించు చున్నాడు. ఈవిశ్వామిత్రు డతని వచనంబుల విని యేదేనిపోరా టంబు గల్పించుకొనడుగదా.

యయా—(కలశంబును విశ్వామిత్రు నియొద్దకు దెచ్చి) తాపసోత్తమా! నీపాదంబు లిటు చెమ్ము.

విశ్వా—(కోపముతో దచ్చి) ఛీ! నీయర్ఘ్యపాద్యంబు లెవ్వనికి గావల యును?

మ. సరసీజాప్తకులంబునం బొడమి శాస్త్రజ్ఞానమున్నేర్చి సాం
పరయఁ విద్యలనన్నియుం జదివి సత్యంబే సదా పల్కుచుఁ
వరయాగంబును జేయగాదలచి సద్భావంబునం బిల్చి యీ
కరణిఁ నన్ను బరాభవించెదవుగా క్ష్మాపాలవంశాధమా.

ఔరా! దుర్మదాంధా! నాకిట్టి యవమానంబు గూర్చుటకేనా వన్ను రావించితివి.

నార—(తనలో) విశ్వామిత్ర కోపాగ్ని యంకురించినదే!

వసి—(తనలో) ఈతనికకారణంబుగ గోపము జనించినదేమిచెపుమా!

యయా—(తనలో) ఈమునిశార్దూలంబున కాగ నాముగల్గునంతటి మహాపచారంబును నేనేమికావించియుంటిని. (ప్రకాశముగా) మునికులతిలకా! అకారణంబుగ నాపైనేలయాగ్రహించెదవు?

మ. అనఘా! నాకుశరీరమున్ దగిలి పాదాబ్జంబులు న్నొచ్చెగా
యని శంకించుచునుంటిగాపునసముద్యద్భక్తి వీక్షించి నీ
ఘనపాదంబు లొసంగు మొత్తెద, మహాయోగంబేల పూనంగ కా
రణమొక్కింతయు గానరాదు చెపుమా రాజత్కృపాశాలివై.

(పాదంబులు బట్టుకొనును)

విశ్వా—(కోపముతో) ఓరీ! దుర్మతీ నాపాదంబులుమాత్ర మే నొచ్చు టలేదురా! శరీరమంతయు మండుకొనిపోవుచున్నది. ఆవురా! ఎంతసాహసకార్య మాచరించితివి! ఇట్టివాడవని తెలిసియున్న చో నేను రాకుందునుగదా!

యయా—(కరంబులుమోడ్చి) మహానుభావా! నిరంతరకరుణామయా!

తే. గీ. కారణంబిసుమంతయు ♦ గానరాదు
కోపమూననేటికి ముని♦కుంజరేంద
తెలుపుమా దోషముండిన ♦ దిద్దుకొందు
మొ క్కెదను నీకు మఱియింత ♦ మొ క్కువాఁడ.

నార—(విశ్వామిత్రు నిజూచి) నీయాగ హంబునకుగారణంబు దెలుప కుండ నాగ హించిన బ యోజనం బేమున్నది. పాపమీరాజు చేసిన యపచారంబేదియో తెలుపుము. దిద్దుకొందుననిపలుకు చున్నాడు.

విశ్వా—(యయాతింజూచి) ఓరీ! నృపాలాధమా! నీకు గారణం బెఱిం గింపవలయునా! నీవుజన్మించుటంజేసిస చ్ఛమైన సూర వంశం బునకుగూడ కళంకమువచ్చెనుగదా ఔరా! నాతపోమహి మంబునెఱింగియు నీట్లుగావించితివిగా! సూర్యవంశపురాజునకు బురోహితుండుగదాయనితలంచి, యువ్వసిష్ఠుండేప థమపూజ్యక ర్హుండని యెంచితివిగాబోలు! మున్ను త్రిశంకునికై సృష్టికి బ్రతిసృష్టిగావించి యపరబ హ్మయని పేరందిన యీ విశ్వామి త్రుండుండెనని యెఱుంగవుగాబోలు. రాజ్యమదాంధత్వమున గన్నులు గానకుంటివా!

తే, గీ. ఎండగాయగ వెఱచును ♦ నినుడు మదిని
వాయువైనను దిరుగదు ♦ భయముబూని

మృత్యువై నను నిరతంబు ♦ వెఱచుచుండు
నేన యొక్కింతయల్గిన ♦ హీనచరిత.

నాముం దీతాపసులెంత విష్ణుబ్రహ్మరుద్రా దిదేవతలెంత ?

వసి—(విశ్వామిత్రు నిజూచి విశ్వామిత్రా ! నీవేదియో యకారణం బుగఁ గలహంబు బెంచుకొనుచుందువుగాని మరియొండుచూడవు. అందఱము నిచ్చోటికొక్కసారియేవచ్చితిమి. అందఱి నీ తండు పూజించినాడు. నన్ను బూజించినాడని నీ కీ కడుపుబ్బు దనమేల? ఇట్టి యనవసరకలహంబును బెట్టుకొనక శాంతము వహించి కార్యముజరుగునట్లు చూడుము.

విశ్వా—వసిష్ఠా! ఇంతమందిమునులలో బ్రథమపూజ నందగలిగితిని గదాయని సంతసంబున నిట్లు పలుకుచుంటివి కాబోలు ! కాకున్నచో మాతగవు దీర్పుమని నిన్ను బొట్టును గొటుకయు బెట్టి యిచ్చుటి కెవ్వరు పిలిచినారు? సూర్యవంశపురాజులకు బురోహితుండవై యుంటం జేసి, యీశతుం డీబాలిశు డీనృపాధముం డిట్లు మమ్ములనెల్ల దృణీకరించి నిన్ను బూజించినాడు. ఇతనిచే నేను ప్రథమపూజనందుటకు సూర్యవంశజులకు బురోహితుడనై యుండిన బాగుండునుగదా !

వసి—ఔరా విశ్వామిత్రా నీకు గోపమే కాని మరేమియు దెలియదు. ధరాభారంబు వాపుటకును, భక్తజనంబుల రక్షించుటకును, నిఖిలతాపస జనాభీష్టంబుల దీర్చుటకును, భక్తరక్షణపరాయణుండును, శ్రీ మదిందిరాసుందరీహృదయాబ్జభాస్కరుండును, సనకసనందనాది మునిబృందపూజితుండును, నగు నమ్మహావిష్ణువు లీలామానుషవిగ్రహుండై సవితృవంశంబున జన్మించునని యెఱింగి, జన్మంబు ధన్యంబగుననితలంచి, యీసూర్యవంశజులకు బురోహితుడనై మెలంగితిని. నేనీపదంబధిష్ఠించినందులకు

శ్రీ రాముని జన్మంబునం జేసి, నాకోరిక నెఱవేరినది. మూఢుండవై నాపురోహిత పదంబును దూషించితివి. నీవు సహస వేల వర్షంబులు మహాఘోరమైన తపం బాచరించినను దీనిని బడయజాలవు. ఇంక మన యిరువురితపముయొక్క తారతమ్యంబులు నిప్పు డిచ్చటనున్న మునులకు దెలిసియేయున్నవి. అనవసరముగా వాగ్వాదంబునకు విజృంభింపక కోపము దిగమ్రింగుకొనుము.

విశ్వా—(కోపముతో) వసిష్ఠా! నోరుమూయుము. హిమశైలంబున వాయుభక్షుణుడనై పరమేశ్వరునిగూర్చి యొనర్చిన నాతపోసామర్థ్యము నీకు దెలియదా? భవత్సుతులను నూర్వురనునుక్కడగించినప్పుడైనను నీకు దెలిసియుండెనా! నీపురోహితపదంబును నీవే వెల్లడించుకొనుచుంటివి. నీపదంబునకై తపంబాచరించువారెవ రును నిచ్చట లేరు. పదివేలసంవత్సరంబులకును నది నీకే యుండవలయును, పరమేశ్వరుడు దానిని మాకుగూర్పకుండుగాక.

దుర్వా—(విశ్వామిత్రు నిజూచి మిత్రమా! విశ్వామిత్రా! వైరాగ్యము లేని యోగము వ్యర్థమైపోవునను సంగతి నీకు దెలిసియే యున్నది. పరమేశ్వరు గూర్చి ఘోరమైనతపముగావించి స్పృష్టికి బ్రతిసృష్టిగావించి మించిన నీకింత కోపము తగదు. ఇంకెవ్వరు ముందు బూజింపబడిననేమి? ముందు పూజింపబడినవారికి వచ్చిన యెక్కువమర్యాద యేమున్నది?

విశ్వా—ఓహోహో! నాకు గోపము తగదని నీవా చెప్పుచుంటివి? పాపము! కోపమన్న నీవేమియు నెఱుంగవు. కోపంబంతయు నొక్కచోట ముద్దగా జేసి, నీయందునుంచి యప్పిరించి నన్ను



ష్టించినాడన్న సంగతి లోకవిదితమే. అట్టి సేవా నాకు బుద్ధిగఱ
పుచుంటివి? చాలు జాలు! ఇంక నూరకొనుము.

అతి —(దుర్వాసునిజూచి) వత్సా! కోపమే ప్రధానముగాగల యీ
తనితో మన కేల ?

యయా—(మునులంజూచి) మునికుంజరులారా! నాకొఱకు మీలో
మీ రేల వాక్కలహంబును బెంచుకొనెదరు. (విశ్వామిత్రు ని
జూచి) మహానుభావా! గాధినందనా! నీకోపకారణము నా
కు దెలియవచ్చినది. నావలన నొక్కింతయు దోషంబులేదు.
నేను జేసినది సరియైనదేయని నేను భావించుచున్నాను.

నార—(తనలో కలహంబు పై దైనంగాని నాకడుపునిండినట్లుండదు.

విశ్వా—(యయాతింజూచి) ఓరోరీ! సూర్యవంశబడబానలా! చేసినదో
షంబు సరియైనదేయని యెదిరించి పలుకసాహసించెదవా! మం
డుచున్న కోపాగ్నిని మఱింత ప్రజ్వరిల్ల జేయుచుంటివిగదా ?

యయా—తాపసోత్తమా! నీవిట్లు కారణంబుగ నాగ్రహించుచున్న
చో నేనేమని చెప్పగలను ?

సీ. తపమునందున బెద్ద ♦ తపసులందఱిలోన
శిష్టగుణుండు వసిష్ఠుడుండ
లఱచేత సప్తాబ్ధు ♦ లమరంగ జేసిన
ఘనతపశ్శాలి య ♦ గస్త్యుడుండ
మహామూర్తులదన ♦ పుత్రులుగాగొన్న
యలఘుతపోసిధి ♦ యత్రి యుండ
ముక్కంటి యవతార ♦ మునుదాల్చి పుడమిపై
రాజిల్లినట్టి దు ♦ ర్వాసుడుండ

తే. గీ. వీరినందఱ విడనాడి ♦ వేడ్కనగుచు
నిన్ను నేరీతి బూజింతు ♦ ననఘ చెప్పుము

విశ్వా—(కోపముతో) ఛీ! దురాత్మా! నీయర్ఘ్యపాదంబులు నాక క్కరలేదు. నీవు యాగము జేసినను జేయకయున్నను నెవ్వరికి గావలయు? నాతపోమహిమయు, నా తేజంబును నీవు కొలదిదినంబులలోనే కనుగొందువుగాక.

(నిష్క్రమించును)

యయా—(తనలో) అక్కటా! ఏమిసేయుదును. ఈవిశ్వామిత్రుండ కారణంబుగ నలిగెనె. పోయెనే (మునులంజూచి) మాసేందులారా! కంటిరిగదా? అతండలిగి యేగినాడు. ఇందుల కేమిసేయుదును. నాబుద్ధిపూర్వకముగ నీతని నవమానింపవలయునని నే నీకార్యమును జేసియుండలేదు.

వసి—రాజేంద్రా! ఈతని కెప్పుడును గోపమేప్రధానము. దీనికై నీవు విచారింపకుము. పరమేశ్వరుండు సమస్తంబును నరయుచున్నాడు. చింతింపక యాగంబాచరించుటకు యత్నముసలుపుము. మాకనుష్ఠానకాలమైనది. ఇక మేమేగెదము. (మునులంజూచి) మిత్రులారా! రండు.

(మునులందఱును నిష్క్రమింతురు)

యయా—మంత్రివర్యా! తానొకటితలంప దైవమింకొకటి సేయునను పలుకు సత్యమయ్యెను.

విశా—రాజేంద్రా! దీనింగూర్చి నీవు చింతింపకుము. అఖిలలోకసంరక్షకుండగు భగవంతుండు నిన్ను రక్షింపఁడా!

(తెఱలో కోలాహలము)

యయా—మంత్రీ! ఆకోలాహలమేదియో కనుగొనిరమ్ము.

విశా—(నిష్క్రమించి వెంటనే ప్రవేశించి) దేవా! మృగబాధ మెక్కుడుగ నున్నదని పుళిందులు మొఱపెట్టుకొనవచ్చినారు.

యయా—ఈసమయంబున నిదికూడ తటస్థమయ్యెనా! సరిస్సే యాగశాలలు నిర్మించుటకు దగిన ప్రదేశమునరయవలయునుగదా? ఆసమయంబున దుష్టజంతు సంహారము గావింపవచ్చును. మనము రేపే బయలుదేరి పోవుదము. నీవేగి పౌరులతో రేపు మేము వేటకువత్తుమని చెప్పి పంపివేయుము. నేనంతఃపురంబులోని కేగెదను.

విశా—చిత్తము. (ఇరువురును జెరియొకపక్కను నిష్క్రమింతురు)



రంగము—అరణ్యము.

[ప్రవేశము—సుశర్మ.]

సుశ—(తనలో) రామ! రామ!! ఈముళ్ళకంచెలలో బడి నడవలేక నాప్రాణంబులు పోవుచున్నవి. ఇంటిమొద్ద గూర్చుని హాయిగా గడుపార భుజింపక, వేటవేడుక జూడ నరుదెంచితి నేల? అయ్యో! నర్మసఖుండనియైనను దలంపక యీరాజు సింగంబును దఱుముచు బరుగెత్తినాడు. అక్కటా! ఒంటినైతిని. ఎటుబోవుటకును దారి గానుపింపకున్నది. (దిక్కులు పరికించుచు బిగ్గఱగా) ఓ యయాతిమహారాజా! ఓయయాతి మహారాజా ఓయయాతిమహారాజా! (అని కేకలువేయుచున్నాడు.)

[యయాతి ప్రవేశించును.]

యయా—(సుశర్మను వీక్షించి) మిత్రమా! ఏమిది? అరణ్యమంతయు బధిరత్వమునలిచ్చునట్లు కేకలు వేయుచుంటివే!

సుశ—రాజా! మంచిపని జేసితివి. ఏమోయనుకొంటిని. అరణ్యంబున నన్నొంటిగా విడిచిపోయితివా! నాకు దిక్కెవ్వరుంటిరని తలంచితివి?



యయా—సఖుఁడా ! ఇంతలోనే నీకుభయమా! నిన్నువిడనాడి యొక్క ఘడియకాలమైనను గాలేదే.

తే. గీ. భీకరపుగేక బెట్టుచు ♦ మీఁదనుముక
నెంచి, వచ్చి మృగరాజు ♦ నంచితముగ
నేలబడవేయగా నింత ♦ కాలమయ్యె
తప్పు మన్నింపుమా నన్ను ♦ దయనుబూని.

సుశ.—ఆసింహముసంగతి జెప్పగనే నాయొడలు కంపమెత్తుచున్నది. ఇంతకును దానిని జంపివచ్చితివా? లేదా?

యయా—నీవు భయమందనవసరము లేదు. దానింజంపియే వచ్చితిని. అదియుంగాక మార్గమధ్యంబున మఱియొకవ్యాఘ్రంబెదురైనది. దానింగూడ సింహంబుచెంతకు బంపితిని. ఆవ్యాఘ్రంబు సంగతి దలంచినచో నాకు గూడ భయంబు జనించుచున్నది

క. దాని బలంబును రోషము
దాని విరోధికిని లేదు ♦ తథ్యము సుమ్మా
దానిని సింగముగ నజుఁడు
మానక పుట్టించి వెలయ ♦ మఱచెను హితుఁడా.

సుశ—ఓరాజా! నాకు భయమగుచున్నది. ఆవ్యాఘ్రంబు మరల రాదుగదా ?

యయా—ఎంత వెఱ్ఱివాడవు. చచ్చినవారు మరల బతికివత్తురా !

సుశ—బతికినవారు చచ్చినప్పుడు చచ్చినవారేలబ్రతుకరు ?

యయా—అట్టిది నీవెప్పుడయిన జూచితివా ?

సుశ—చూడకేమి! స్వవిషయంబునందే చూచితిని. కొన్ని వత్సరంబులకిందట నేను కాశీయాత్ర సేవింపదలంచి గృహంబు వెడలి బయలుదేరి యాయాతీర్థంబుల దిరిగి మరల గృహంబునకు వచ్చుచు మార్గమధ్యంబున మామగారింటికేగితిని. నారాక

నెఱింగిననామిత్రుడొక్కడెదురుగచ్చి నన్నుజూచి " మిత్రమా! సమయంబునకు వచ్చితివి నీభార్య విధవముండయైనది కేశఖండనము నేడు జరుపబడు" నని చెప్పెను. ఆమాటలు విని నేను గొల్లుననేడ్చుచు నింటికి గితిని. నాయేడ్పు జూచి యింటిలోనివా రందఱును నేడ్వసాగిరి. అప్పుడిరుగుపొరుగువా రందఱును వచ్చి నన్నుజూచి యేడ్పునకు గారణం బడుగగా నేను ,,నాభార్య విధవయైన' దని నామిత్రుడు చెప్పినాడు. కావున నేడ్చుచుంటి" నని పలికితిని. అప్పుడె వారందఱును నన్ను జూచి పెద్దపెట్టున నవ్వి నీవు బ్రతికియుండగా నీభార్యకు వైధవ్య మెట్లువచ్చునని పలికిరిగాని నేనూరకొనకుండుటచేత నీవు చచ్చి మరల బ్రతికితివిగావున నీభార్యకు వైధవ్యములేదనిపలికి యోదార్చిరి.

యయా—(నవ్వుచు) నీ తెలివి యట్లున్నది. మిత్రమా! నీచరిత్ర మంత్రయు నవ్వు బుట్టించునుగదా !

సుశ—రాజా! చెప్పదలంచినచో నింకను ననేకములయినసంగతులున్నవి. నాకు మిగుల నాకలియగుచున్నది. ఇంతవఱకును నీ వరణ్యంబున నుందువన్నసంగతి దెలిసియున్నచో నిన్నిగారెలయినను మూటగట్టుకొని తెచ్చియుందును. ఇంకనైనను బురంబునకు మరలుదమా ?

యయా—మిత్రమా! వేటయందు మిగుల నలసియుంటిమిగావున నా వటవిటపికిం దనెక్కింత కాలము విశ్రమించిపోవుదము.

సుశ—ఏమోయీ! రాజా! ఇంకను నన్ను జంపదలంచుచుంటివా! సంధ్యాసమయంబైనచో నేమృకమైకంబయినను గుబుక్కున మింగివేయునేమో యని భయము గలుగుచున్నది.



యయా—నాయండనుండగా నీకట్టిభయంబుండదు. ఇచ్చోట యాగ శాలలు నిర్మించుటకై దుష్టమృగంబులను సంహారించితిమి. ఇంకను నీయరణ్యంబున దుష్టసత్వంబులున్నవనియే తలంచుచుంటివా? రమ్ము ఆవృక్షముకి ంద కేగుదము రమ్ము.

(వృక్షముకి ందికేగుచున్నారు)

సుశ—రాజా! చిరకాలంబునుండీ నీయాస్థానంబు గనిపెట్టుకొనియున్నవాడను. అందులో భూసురుండను నీవు చేయుయాగంబున నన్నెట్లు సత్కరించెదవో.

యయా—ఇదియంతయు నీదికాదా!

సుర—ఎగవేయుటకు మంచిమాట చెప్పుచుంటివే? పోనిమ్ము. ఏమున్ననేమి! లేకున్ననేమి! నేను భోజనప్రి యుండనుగదా! యాగసమయంబున నాకు భోజనంబున కిబ్బందియుండదు. భోజనమాచరించినతరువాత, కావలసిన జూరెలు, గారెలు, చెంబులోవేసికొనిపోయి యింటియొద్ద హాయిగా భక్షించెదను.

యయా—నీయిచ్ఛవచ్చినట్లే సేయుము.

సుశ—దీనికేమికాని రాజా! నాకొకదానికై సందియము గలుగుచున్నది. మొన్న విశ్వామిత్రుడు నీపైని నలిగి వెళ్ళిపోయెనని చెప్పితివే. అతడు నీయెడల నేమియు హానిసేయడుగదా!

యయా—సఖుడా! బుద్ధిపూర్వకముగా నతని నవమానింపనప్పుడు మనకు గీడుసేయుటకు బరమేశ్వరుం డాతని కెట్లుబుద్ధిపుట్టించును. ఆతాపసపుంగవుండు కోపస్వభావుండైననునిరంతరకరుణామయుండుసుమా.

(అప్పు డొకలేడి వచ్చును.

సుశ— లేడినిజూచి) భూపాలా!. అరణ్యంబుననున్న దుష్టసత్వంబులన

న్నింటిని వధించితినని పలికి వే. అదిగో లే చూడుము! ఇది నామీదకు దూకును గాబోలు.

యయా—లే కూ రజంతువుగాదు. ఇది యొవ్వరికిని నేయపాయంబు నుజేయదు, లేడింజూచి) ఆహా! ఏమి దీనిచందము.

తే. గీ. తారకాధీశు నడుమను ♦ దనరియుండు
హరిణ మీరీతి బుడమి వి ♦ హారమునకు
నచ్చెనా! యనునట్లు నా ♦ భావమునకు
నచ్చెరువు బుట్టుచున్నది ♦ యనుగుసఖుడ.

అటుజూడుము.

తే. . తొంగితొంగిసూచుచు గడు ♦ వంగి వంగి
పచ్చికచు నమలుచు వడి ♦ బరుగులిడుచు
రంగు లీనుచునున్న కు ♦ రంగరాజ
మదిగో! మోదంబుగల్గించె ♦ మ కి నిపుడు.

మిత మా! ఈహరిణంబును బట్టుకొనిపోయి నాకుమారున కొసంగెద గాక బాణమిటు తెమ్ము.

సుశ—మహారాజా! బాణంబును సంధించి విడిచినచో నియ్యది నేల పైగూలదా?

యయా—దీనిపాదంబునకు దగులురీతిని శరంబు విడిచెను. చేతబట్టు కొనుట కియ్యది దొరకదుగదా.

సుశ—రాజా! లేనిపోనిశ మమేల? ఇది యేమాయామృగమో! దీని బట్టుకొనుటవలన మన కేకీడు మూడునో. ఆలోచింపుము.

యయా—మిత్రమా! నీకన్నిటికిని భయమే. (బాణమును సంధించి యాశ్చర్యముతో) వన్నట్లిదిమాయామృగంబువలెనేయున్నది

తే. గీ. ఇప్పుడీక్షించితిమికాదె ♦ హేమహరిణ
మింతలోమాయె బులికాగ ♦ వింతదోచె

చూడుమల్లదే మనపైన ♦ జూపువేసె
నేమిసేయుద మిప్పట్ల ♦ నెంచిచెపుమ.

(భయముతో) ఓరాజా ! నన్నురక్షింపుము. రక్షింపుము. నామెడలు గంపమెత్తుచున్నది. అయ్యో ! లేడి వ్యాఘ్రమైనది. కాదు. లేడి యిదివఱకే పాఱిపోయినది. ఇది మఱియొక వ్యాఘ్రము. కాకున్నచో లేడి పులి యెట్లగును ? సత్వరమ్ముగ బాణంబును బ్రయోగించి దీనితల నూడదీయుము.

యయా—(బాణంబును సంధించి కొట్టుమందువా ?

సుశ—ఇంకను గొట్టుమందువాయని యడుగుచుంటివా ! నేనుబ్రతుకవలెనని నీకిష్టములేదా ? నాపిల్లలకు నేనొక్కడనేతండ్రిని. నా భార్యకు నేనొక్కడనేభర్తను. నన్ను గాపాడవయ్యా! బుద్ధిమాలి నేడు నీతోనరుదెంచితిని. ఇంక నెప్పుడునురాను. ఇప్పటికి రక్షింపుము! రక్షింపుము!! (భయమును నటించును)

యయా— బాణంబును విడుచును)

(తెరలో)

(ఔరా! ఎవ్వడవురా నీవు? విశ్వామిత్రా శ్రమహరిణంబును గూల్చితివి. కానిమ్ము! కానిమ్ము!! ఈసంగతి మాగురుండగు విశ్వామిత్రున కెఱింగించెద)

ఇరువురును నిశ్చేష్టితులై యాలించుచున్నారు)

యయా—హా! ఎంతకార్యము చేసితిని !

సుశ—(తనలో) కోపమునిగినది. ప్రకాశముగా) రాజా! తొందర పడి మిగదా

యయా—మిత్రమా! తానొకటిగలంప దైవమింకొకటిసేయునను నుడువు సత్యమయ్యెనుగదా? ఆభగవంతుడెట్లుచేసినాడో కంటివా

తే గీ. హరిణమును మనముందర ♦ నలర జేసి
యింతలో వ్యాఘ్ర ముగమార్చి ♦ వింతగొలిపి
శరము కరమునుండియు వడి ♦ జాఱజేసి
యక్కటా! ముంచె, నాకొంప ♦ ననుగుసఖుడ.

విశ్వామిత్రు ని యాగ హరింబునకు బాత్రు డనై తినిగదా! మొన్న సక
లమునీంద సముఖంబున నవమానించితినని, యకారణంబుగ న
లిగిన యాతనికి మఱింతయాగ హాముచ్చునట్లు జేసితిని.

ఉ. ఆతడు మానసంబునను ♦ నంచితకోపముబూని చూచినన్
భూతలమంతయున్ వడకు; ♦ భూతగణాధిపుడైన నరుదు నన్
శీతమయూఖునున్ ద్యుమణి♦చిత్తములన్ భయమందుచుందు పృ
థ్వీతలనాథు లెంత? ముని ♦ భీకరకోప మహాబ్ధి దాటగన్.

తే. గీ. ఏమిసేయుదు నింక నా♦ కేది తెరవు
ఎవ్వరిని వేడికొందును ♦ నెవరుబో తు
రేవిధంబున నాతాప ♦ సేందు ంప
వహ్ని జల్లార్పగలవాడ ♦ భవ్యసఖుడ.

సుశర్మా! వేటకరుదెంచి యిట్లయితిని. ఆశ మహరిణంబును గూల్చితి
నని శిష్యునిచే విని దండతాడితమహోరగంబుకరణి మండిప
డుచు నాతడిట్లువచ్చును. కావున నాతండు మనకడకు రాక
మునుపే మనమే యతనిసన్నిధికేగి, పాదంబులపైబడి రక్షింపు
మని వేడుకొనుటయే తపఃయని తోచుచున్నది.

సుశ—రాజా! నీవూరక చింతింపకుము. అడవియందు ముక్కుమూసి
కొని తపంబాచరించుకొను మునీందులకు రాజులపై గోపమే
లయుండును? అదియుంగాక నీవీకార్యము తెలిసిచేసినది కా
దుగదా!



తెరలో)

తే. గీ. గాధినందను ఘన పః ♦ కలితశక్తి
కన్నుగానక యెవ్వడ ♦ ఖండనమదము
బూని పెంపుడు లేడిని ♦ బుడమినేసె
వాని యంతంబు నికజూచు ♦ వాడ నిపుడె.

మయా—(భయముతో) మిత మహా విఁటివా! ఈపలుకులు.

తే. గీ. హరిణ మీరీతి నాచేత ♦ నవనిపైన
గూల్పబడెనంచు నాలించి ♦ కోపమూని
యేగుదెంచుచున్నాడు హా ♦ నీందు డతుగొ
యేమిసేయుదు నింక నా ♦ కేది తెరువు.

(దిక్కులు పరికించి

సీ. అమితమహా కో ధాగ్ని ♦ యవతరించినరీతి
కన్నుల నిప్పులు ♦ గడలుకొనగ
చటులజాటాప భా ♦ పటలంబు లిరుగెలం
కుల భుజముపయిన ♦ నలవరింప
దిక్కులందు గడు బ ♦ తిధ్వను లీయంగ
సింహనాదంబులు ♦ చెలగిమిగుల
ధారుణీ చక ంబు ♦ దల్లడనుందంగ
బృథుశైల గోత ముల్ ♦ పెల్లగిలగ

తే. గీ. దండమును ది ప్పుకొనుచు స ♦ త్వరితగతిని
వచ్చుచున్నాడు తాపస ♦ వర్యుడహుగొ!
రెండవ పురారియాయన ♦ గుండెలవియ
నేమిసేయుద? మిప్పట్ల ♦ నెంచిచెపుమ.

సు—(తనలో) కాలికి బుద్ధిచెప్పనున్నచో బాగుండునేమోకదా!
[illegible]ముగని జూచిన నాదేహము [illegible] చున్నది. (పరికా[illegible]

ముగా) రక్షింపుమని యాతని పాదంబులపై బడిన రక్షింపక యుండునా !

[అప్పుడు విశ్వామిత్రుడు తే. గీ. "గాధినందను" అను పద్యమును జదువుచు బ వేశించును]

యయా—(విశ్వామిత్రు ని పాదంబులపైబడి) ఓమహానుభావా ! కుశికనందనా !

శా. సారాచారవిచార సారుడవు; ని ♦ ష్కాపట్య లుండవుర్
గారుణ్యామృతసాగరుండవు, జగ ♦ త్కల్యాణ తేజుండవుర్
ధీరోదారుడవుర్, గుణాఢ్యుడవునై ♦ చెల్వొందు నీవిట్టులర్
గౌరీశభృకుటీ కటాక్షములనర్ ♦ గానంగ నికేటికిర్.

విశ్వా—(పరికించి) ఓహో యెవ్వరోయనుకొంటిని ! సూర్యవంశరాజశేఖరుండవగు యయాతివేనా! నీవు కావుననే యిట్టికార మాచరింపగలిగితివి?

మ. సరసీజాప్తకుల ప సూతివయి, శా ♦ స్త్రజ్ఞానసద్వేత్తవై
హరిపాదాంబుజ చింతనారతుడవై ♦ యానందసంధాయివై
ధరణీపాలన మాచరించుచును, ని ♦ ర్దాక్షిణ్యతర్, సమ్ము నీ
శ్వరవాటంబుననుండు లేడిని వధిం ♦ పం జేతులెట్లాడెరా.

ఓరీ! దుర్వినయశీలా! ఎంతమంది రాజులు వేటకురారు? నీవలెనే తాపసాశ్రమంబులనుండు సాధుమృగంబులను బాధించిరా? రాజమదాంధకారంబున మునింగి కన్నును మిన్నును దెలియ యిట్టి కార్యమాచరించితినా !

మ. నిను దాగొమ్ముల జిమ్మెనో కఱచెనో ♦ నీకేమియొగ్గుర్ బొనర్చెనొ; కాళ్ళర్ విదలించెనో; పొడిచెనో ♦ చేయంగలేదేమి; నా వనమందుర్ వసియించు లేడి, నకటా ♦ భంజింపగా, నేప మో జనముర్ గాంచితినీవు, చెప్పగదరా ♦ ఘ్మాపాలవంశాధమా.



అపురా! ఆ మమృగంబులను వధించుటకే కాబోలును బహ్మ యీరాజ్యంబు నీపాలు జేసినాఁడు.

యయా—(కరంబులుమోడ్చి) మహానుభావా! వేటకరు దెంచి విశమించియుండగా, నాకంటి కొక లేడి గనుపించి వెంటనేవా భ్రమముగా వఱాజీనది, వ్యాఘ్ర మని తలంచి వెంటనే బాణము విడిచితిని. నే నియ్యది బుద్ధిపూర్వకముగా జేసినదిగాదు.

తే. గీ. తనయు డజ్ఞానియై చేయు ♦ తప్పులెల్ల
దండి క్షమియించి కాచు వి ♦ తాన నన్ను
గావగాఁగదవయ్య, ని ♦ ష్కలుషమతిని
జేసి; మొక్కుచున్నాడ గా ♦ శికమునీంద.

ముక్కంటి గర్వంబునైనను నడంపజాలు నీకోపాగ్నిం దరింప నే నెంతవాఁడ.

విశ్వా—(కోపముతో) దుర్మదాంధా! నిన్ను సైరింతుననుమాట కలలోనివార్త. మొన్న నిఖలమునీంద సముఖంబున నన్నవమానించినందులకే నాహృదయంబున రవులుకొనుచున్న కోధాగ్నిని మఱింత ప జ్వరిల్ల జేసితివి. ఆవసిష్ఠుని తేజం బెక్కుడో, నా తేజం బెక్కుడో, యిప్పుడు చూచెదవుగాక.

మ. అవమానించితి వీవు మొన్న సభలో ♦ నద్దాని సైరింపగా
నవినీతిన్ వధియించినావు, మృగము ♦ ద ద్బాణముల్ వేసి, యా
శివుడైనన్ నను శాంతమానసునిగా ♦ జేయంగ శక్తుండె, యో
యవనీపాలక చూచితీఱెదను, నీ యంతంబు భూమీస్థలిన్.

(నిష్క్రమించును.)

యయా—ఆహా! మునివర్యుడు రోషకషాయితాత్ముడై నాపా న [illegible]ంగీకరింపక యరిగినాఁడు. ఇప్పుడు నే నేమిసేయుదును. (సుశ

ర్ర జూచి) మిత్రమా! చూచితివిగదా? ఈమునివరుండు నా మాట వినక యేగినాడు. నిష్కారణంబుగ నీతక కోపాగ్నికి బాలుపడితినిగదా!

సుశ—రాజా! ఈతడు నీ కేమియు శాపమీయక యేగినందులకు సంతసింపుము.

యయా—వెఱ్ఱివాడా! శాపమీయవలయునా. నన్నింక నెన్ని బాములు బెట్టునో?

తే. గీ. అంతమును జూచితీరుదు ♦ నంచు బలికి
కోపమున నేగె, నామున ♦ కుంజరుండు
నింక నెయ్యది సేయంగ ♦ నెంచినాడో
యెవరి జేరుదు, నింక నా ♦ కెవరుదిక్కు.

సుశ—రాజా! ఈయరణ్యరోదన మెందుకు. పురంబున కేగి కర్తవ్యము విచారించుకొందము.

(ఇరువురును నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము.







శ్రీ

# హనుమద్రామ సంగ్రామము.

## ద్వితీయాంకము.

[సాకేతపురము:—రామునిమందిరంబున
రాముడును—విశ్వామిత్రుడును ప్రవేశము]

రాము—మునీంద్రా !

తే. గీ. పావనంబయ్యె నాదగు ♦ మందిరంబు
చింతలన్నియు బాసితి ♦ స్వాంతమందు
జన్మమా! ధన్యమయ్యెను ♦ సంయమీంద్ర
బ్రహ్మఋషివైన భవదీయ ♦ రాకకతన.

దేవా! భవదీయపుణ్యపాదరజము సోకుట కీపురం బెట్టిభాగ్యంబును జేసియుండెనోకదా ! (ఇంచుకయూరకుండి)

మ. వరశిష్యుల్ వినయంబు జూపుచును సే ♦ వల్ మీకుగావింతురే
గరిమన్ గోవులు దుగ్ధమిచ్చునుగదా ♦ కా ంబులీడేఱునే
ధర దేవార్చనకై నతంబు తరుబృం ♦ దంబెల్ల బుష్పించునే
పరమామోదముతోడ జెప్పగ. నిర్మ ♦ బా ంతు, మానీశ్వరా.

విశ్వా—రఘునందనా !

తే. గీ. విఘ్ననకు బ తిరూపమై ♦ వెలసియుండి
ధర్మమార్గంబు దప్పక ♦ ధరణిజనుల
పాలనముసేయుచున్నావు మహితకృపను
మాకుగలుగునే, కొఱతలు మానవేంద్ర ,

రాము.—మునీంద్రా ! నీకు నాయందున్న ప్రేమచే నట్లు వచించెదవు. నీకృపకర్హుండనే కాని స్తుతికర్హుండ గానని విన్నవించుకొనుచున్నాడ. (ఇంచుకయూరకుండి) మహాత్మా ! ఏదియో గొప్ప కారణం బుండినగాని భవదీయపాదారవింద సందర్శనంబు నాకొనసంగవు.

విశ్వా.—

తే. గీ. దైత్యభయమింత లేకుండ ♦ తపముసాగు
చున్నదికదా! వచింపు శు ♦ శ్లోకచరిత
దానవానీకమును గూల్చి ♦ తాపసులను
గాచియున్నావు, కాదొకో ♦ కౌసలేయ.

మ. దశదిగ్భాగములన్ బ్రతాపమహిమల్ ♦ దట్టంబుగానిండ; న
ద్దశకంఠున్ సమరావగణంబున మహా ♦ ధైర్యంబునం దాకి; శ
ర్కాశభల్లంబుల సంహరించి, మునులన్ ♦ గాపాడి, చెల్వొంది, స
దశమునున్ గొంటివి, దేవతాసకర మా ♦ హ్లాదింప రామాధిపా.

రాఘవేంద్రా ! ధరాభారము వాపదలంచి యిద్ధాత్రిపై జెన్మొంది సకలదానవులను సంహరించి యుండగా నింకను మునులకు దానవ భయముండునా ?

రా.—తాపసోత్తమా! నీరాకకు గారణం బెఱిగింపగోరెదను. ఈ సేవకుం డెట్టియభీష్టమునైనను దీర్చుటకు సంసిద్ధుడై యున్నాడనినమ్ముము.

విశ్వా.—(తనలో) ఈవాగ్దానమే నాకు గావలసినది. నాకాయయాతి నృపుండు చేసిన పరాభవంబునకు బ్రతీకార మాతని నితనిచేత జంపించుటయే. ఎట్లుని యకార్యంబున తనిని సమ్మతింప జేయవలయును (ప్రకాశముగ) రామా ! నాకార్యం బెట్టిదైనను జేయుటకు సంసిద్ధుడవై యుంటివా ?



రాము—మునీంద్రా ! సందియమేల ?

తే. గీ. పసితనంబున శరవిద ♦ మహితకృపను
నొసగి; హరువిల్లువిఱిపించి ♦ యుర్వీసుతను
బెండ్లిగావించితివి నాకు ♦ బృథ్వియందు
నీయనుజ్ఞ దాటుదునె ? ము ♦ నీంద్ర చంద్ర .

విశ్వా—సుందరాంగ్లీ వచియింతురుగాని గార్యము జేయవలసివచ్చినప్పుడు
వెనుకంజ వేయుదువేమో యని సందియం బగుచున్నది.

రాము—దేవా ! నీనుడులన్నియు గ్రొత్తగనున్నవి. నన్న న్యథా భా
వించుచున్నందులకు నాకాశ్చర్యము గలుగుచున్నది. నీపట్టున
గాని మరియెవ్వరిపట్టునగాని యిక్ష్వాకువంశజు లనృతంబాడి
యుండిరా !

తే. గీ. సత్య మారసియేకదా ♦ జనకుడప్పుడు
యాగరక్షణంబునకున్నై ♦ యంపెమమ్ము
నీదువెంటను; నెఱుగవే ? ♦ నేడు క్రొత్త
వానిగతినన్ను నీరీతి ♦ బలుకనగునె ?

మ. ఘనసామ్రాజ్యరమాసతీమమతమున్ ♦ గాదంచుఁ ద్రోసినన్
జనముల్ దూఱ; నాలుబిడ్డలును దైన్యంబుఁ బొందినన్; శాత వ్రుల్
ఘనప్రాణంబులు దీతుమంచుభయము ♦ ల్గల్పింతుఱ్రిగా రెప్పుడున్
అనృతంబాడగ నెంచరెప్డు, రవివం ♦ శాబ్ధిప భూతపభుల్.

ఇంక నీవు నాయందు సందియంబును విడనాడి నీయ ష్టంబెట్టిదియో
తెలుపుము.

విశ్వా—నాయభీష్టంబును దెలిపిన పిమ్మట జేయజాలనని చెప్పగూడ
దసుమా !

రాము—(తనలో) ఏమి ! ఈమునీశ్వరుం డెన్నడును లేనివిధంబున ని
పలుకుచున్నాడు. ఎట్టి బెట్టిదంపుగోరిక గోరునోకదా ?

ఏమైననేమి ! ఎట్టియభీష్టంబైనను దీర్చెదనని వాగ్దాన బొసం గి యుంటినిగదా. (ప్రకాశముగా) మునీందా ! మీకీశం కయేల ?

తే. గీ ఈశరీరంబు నిమ్మన్న ♦ నిచ్చువాడ
దక్కనవి చెప్ప నేటికి ♦ దాపనేంద
సందియంబును వీడుచు ♦ డెందమందు
వేగచెల్పుమా ! నీదు న ♦ భీష్టమేమొ.

విశ్వా—(తనలో) ఇంకనేను సందియ బందనేల ? నాయ భీష్టంబును దెల్పెదగాక. (ప్రకాశముగా)

తే. గీ. భవ్యసభలో నవనూన ♦ పలుచెనన్ను
గర్వచిత్తుడై యెప్పుడు ♦ తాస్మతలేదు
డొక్కడాహీను నీవింక ♦ నుర్విగూల్చి
సంతసంబును గొల్పుమీ ♦ స్వాంతమునకు.

రాము—(తనలో కోపహృదయుండగు నిమ్మునీందు డెట్టియభీష్టం బు గోరుచున్నాడు అక్కటా ! ఈతనికోపాగ్నికి బాల్పడి నయారా జెవడో కదా ! ఇందులకే కాబోలీతడు మొదట నెట్టికార్యమునైనను దప్పక చేయుదునని వాగ్దానంబును గ్రహిం చినాడు. (ప్రకాశముగా) మహానుభావా ! నీకాగ్రహంబుగలి ంచిన యాభూపతి యెవ్వరో తెలియగోరెదను.

విశ్వా—నీకు దెలియని విశేషమేమున్నది. సూర్యవంశజుండగు యయాతి.

రాము—(తనలో) ఇంకను నేనెవ్వరో యని తలంచుచుంటిని. అహ్హా ! మాకు బరమబంధుడగు యయాతియేనా ! అతడీత మొడం నేమికీడుగావించెనోకదా ? (ప్రకాశముగా) మునీంద...

తే. గీ. సతమెప్పుడు తప్పక ♦ శ్రోత్రతలంబు
బాలనముసేయు వాడంచు ♦ భవ్యమతులు
పెక్కుమారులు చెప్పగా ♦ వింటి; నాయ
యాతి నీకేమి గావించె ♦ హాని చెపుమ.

విశా—రామా ! నీవట్లే వినియుందువు. ఆతడొకయశ్వమేధయాగం
బును జేయసమకట్టి మునివర్యుల నందఱిని దద్విధానంబు దెలి
యగోరి రావించెను.

రాము—తాపసోత్తములను రావించుట మంచిదియేకదా? తరువాత.

విశ్వా—నేనును ననేకమునులును నచ్చోటకేగితిమి. మునులనందఱిని
జూపించు సమయంబున నన్నతినీచునిగ బరిగణించెను. అంతి
యేకాక నాయాశ్రమ హరిణంబును గూల్చెను. దానంజేసి నే
నాతని యంతంబు జూచితీరుదునని ప్రతిజ్ఞంగావించియున్నా
డ. కావున నాప్రతిజ్ఞ బాలించుకర్తవు నీవనితలంచి నీయొద్ద
కరుదెంచితిని.

రాము—మహానుభావా ! నావిన్నపం బొక్కటి యాలకింపుము.ఆయ
యాతి నిరంతరధర్మవ్రతాచారపారీణుండని చెప్పగావినియుంటి
ని. ఆతని హృదయంబు నిష్కళంకమైనది. సూర్యవంశ ప్రభూ
తులెప్పుడును నిట్టి యకార్యమును జేయుటకు సమ్మతింపరు. ఒ
కవేళ నాతడు పొరబాటున జేసియుండవచ్చును. అందులకు
మీరాతనపై నలిగి యింతదారుణప్రతిన బూనుట యుక్తము
గాదని చెప్ప సాహసించినందులకు మన్నింపుము.

తే. గీ. నేనతని దెచ్చి నీదు స ♦ న్నిధిని బెట్టి
తప్పులెల్ల క్షమింపుమో ♦ తాపసేంద
యంచు, నీపదంబులకు మ్రొ ♦ క్కించువాడ
ప్రతినవీడుము దయబూని ♦ భవ్యచరిత!



విశ్వా—(కోపముతో) ఏమీ! రామచంద్రా ! నీయంతజ్ఞానమునాకు లేదనియా నాకేవియో నీతు లుపదేశింపసాగితివి. చాలు జా లు ! నిన్ను నాకు నీవొసగఁ దలఁచినదేమన్న వేడికొనలేదే ?

తే. గీ. సత్యసంధుండ వంచును ♦ జగములెల్ల
బేర్కొనుచునుంట యెఱిఁగియు ♦ వినియు నాకు
కోర్కె దీర్తునటంచును ♦ గోమరుమిగుల
జేరినాడను నిన్ను, సు ♦ శ్రీ గుణాఢ్య.

చం. మనుకులమందు బుట్టి జన ♦ మాన్య చరిత్రు డవంచు, భూమిపై
వినుతికినెక్కి; నాదగు న ♦ భీష్టము దీర్తునటంచుబల్కి; నె
మ్మనమున సంశయించి, పలు ♦ మాటలు బల్కఁగనేల యిట్లు; నీ
వనినది సేయలేనను ♦ నంచిత సంతసమందియేగెదన్.

రాఘవా! ఏయభీష్టంబైనను దీర్తునని వాగ్దానంబు నొసంగి సంగతినంత యు విని యిప్పుడిట్లు పలుకుదువా ? పోనిమ్ము. వాగ్దానం బీ య లేదనుము నాదారిని నేబోయెదను.

రాము—ఓమహానుభావా ! నీవట్లు వచించిన నే నేమనగలను. అనృ తంబాడుటకు నాచిత్తంబు సమ్మతించునా ! ఈసంగతి నీవె ఱుంగవా !

తే. గీ. అతఁడు మాసూర్యవంశంబు ♦ నందు బుట్టి
బంధుడై యొప్పుచుంట జం ♦ పంగ నాకు
బుద్ధిపోడమికయున్నది ♦ పూజ్యచరిత
నన్ను రక్షింపు మికనీవు ♦ న్యాయమరసి.

నిశ్చయంబుగా నీవనృతంబాడవన్న సంగతి నేనెఱుంగుదును. ఆతడునీ యెడల ద్రోహము జేసియే యుండును. అందులకు సందియం బా వంతయుఁ నుండదు.



తే. గీ. ఎంతదోషంబు జేసిన ♦ నంతశిక్ష
జేయుటది న్యాయమగు గాని ♦ చిన్నతప్పు
జే; దానికి గొండంత ♦ శిక్షనిడుట
ధర్మమానంచుఁ దలఁచె దో ♦ దాపసేంద్ర.

మీ కాన్నృపుం డొనరించిన యెగ్గునకు మరణదండన మందవలసినవాఁడు గాఁడు. కావున నాయందు గృపాంతరంగుండవై మన్నింపుము.

విశ్వా—ఆహా! రామచంద్రా! సూర్యవంశ పా విఖ్యాతులు నిరంతర సత్యవ్రతాచార పారీణులనుమాట యసత మయ్యెను గదా? ఆయయాతిని వధింపజాలక భీతిల్లి యిట్లు పలుకుచుంటివో, లేక యసత్యముపలికి యశంబుగోల్పోవుట కిట్లుపలుకుచుంటివో, తెలియకున్నది. కాకున్నచో నిచ్చిన వాగ్దత్తంబు ననుసరింపక యుందువా? నాయందెంతయో భయభక్తులు గల్గి వర్తించు వాఁడవని తలంచితినిగాని యిట్లు నేను మోసమందుదునని యెఱుంగనైతి. అవురా! కృతఘ్నా! నేను జేసినమహోపకారంబుల నన్నియు మఱచిపోతివి కదరా! పా జ్యరాజ్య మదాంధకార మెట్టి కట్టడి కారంబునైనను జేయించును.

శా. బాలత్వంబున రాజసన్నిధి ధను ♦ ర్భంగంబు గావింపగా
వాలాయంబున జేసి; జానకిని ను ♦ ద్వాహంబు జేయించి; భూ
పాలశ్రేణి ముదంబునందగ ధనుః ♦ పాండిత్యమున్ గూర్చు; న
న్నాలోకింపవో, కాక నన్మఱచితో ♦ యాశ్చర్యమయ్యెన్ నృపా.

ఎట్టి యభీష్టంబునైనను దప్పక శిరసావహించి దీర్చెదనని చెప్పుటచేతనే నేను నారహస్యంబును వెల్లడించితిని అందులకునీవేమియో పలుకకున్నావు. ఈయనవసరమైనసంభాషణంబుతో నాకేమి పని యున్నది? నాయభీష్టంబును దీర్చి సత్యయశంబునందుము.

తే. గీ. కారణంబింత లేకుండ ♦ ఖ్యాతలేంచు
నాయయాతిని రాముండు ♦ దయనువీడి
ధరణిపైఁగూల్చెననెడి నిం ♦ దాభరంబు
మోయుటది యెట్లుచెప్పుమా ? ♦ పూజ్యచరిత !

విశ్వా—(తనలో) ఈతఁడు భీతిఁ౦ది నా కార్యమును జేయ నెంచకున్నా ఁడు. (ప కాశముగా) రామా ! ఇందు జననిందఁ బడవలసినదే మున్నది? నన్నుఁ బరాభవించుటచేత నీవిట్లు సేయవలసివచ్చిన ది. నాకుఁ గీడుచేసిన నీకుఁజేసినట్లుగాదా? అది యట్లుండని మ్ము. నీవు పాపము సంభవించునని భయము నందుచుంటివా! ఎంత వెఱ్ఱివాఁడవు.

తే. గీ. రామ శ్రీరామ యన్న మా ♦ త మునజనులు
పాపసముదయం బెల్లను ♦ బాయుచుందు
రట్టిచో పాపముల్ నిన్ను ♦ నంటఁగలవె
నిప్పునకుఁ జద లంటునే ♦ నీరజాక్ష.

నీవు సామాన్యనరుండవు గావు. కావున నింక సంశయము విడిచి య యాతివధోద్యోగ భారము నీభుజస్కంధమునం దుంపహింపుము.

రాము—మహాత్మా! ఆజ్ఞననుసరించెదఁగాక రండు. సంధ్యా సమయం బగుచున్నది.

ద్వితీయాంకము.







శ్రీ

# హనుమద్రామ సంగ్రామము.

## తృతీయాంకము.

[యయాతి—మంత్రి యగు విశారదుఁడు

యయా—మంత్రీ! విశారదా! వింటివిగదా నారదుని పలుకులు. అక్కటా! ఆవిశ్వామిత్రుఁడు నిష్కారణంబుగ నాపైనలిగి రామునికడకేగి యేవియో కొండెంబులను బలికి, నన్నుజంపుమని వచియింప నందుల కాతండుసమ్మతించెనఁట ఆహా! న్యాయాన్యాయవిచారణదక్షుండగు రాముండు విశ్వామిత్రుని వాక్యంబుల నాలించి నన్నుఁ జంపుదునని యాతనికివాగ్దానంబొసంగుటకు నెట్లుసమ్మతించెనోకదా! (ఇంచుకయూరకుండి విశ్వామిత్రుని నుద్దేశించి) ఓవిశ్వామిత్రమునీశ్వరా! అకారణంబుగ నాపైనలిగి రామునిచే నన్నుఁజంపింపఁదలంచితివా! దీనంజేసి నీకేమిలాభముగలుగును? అయ్యో! వైరాగ్యములేని నీయోగితనంబేల? తాపసులు రాజులతోఁ గక్షవహింతురా! నేఁడు వనంబున హరిణంబును బుద్ధిపూర్వకముగవధింపలేదు. కావున నపరాధంబును సైపుమని పాదంబులపైఁబడి వేఁడికొంటినే. అప్పుడే నీయంతంబుఁజూచితీరుదునని కోపావేశంబునఁబలికితివి. కాని నీవింత యకార్యముసేయుదువని కలనైనం దలంపనైతిని. (రామునుద్దేశించి) రామా! సుగుణధామా!

మ. అపరాధం బొకయింతయైన నెఱుఁగక ♦ నో! మౌని; నాపైనమర్
విపరీతంబగు భావలన్ బలికి, పృ ♦ థ్వీన్ గూల్చు మన్నంత నే
నృపవంశాగ్రణీ! సమ్మతించితివె? ♦ నీ విక్కార్యమున్ జేయఁగా
నపవాదల్ జనియించునే మొయని నీ ♦ వాత్మన్ విచారింపవో?

రఘునందనా! నిరంతరసత్యవ్రతాచారంబునకు దానకమ్మై, దానధర్మం బులకుఁ బట్టుకొమ్మయై, సుగుణంబునకుఁ బెట్టియై, యార్తరక్షణంబున కిక్కయై, విలసిల్లు నిక్ష్వాకువంశంబున జన్మించి, మునిబృందంబును, దేవతానికరంబును, నాపాడి లోకంబుల నుద్ధరించి, ధర్మంబుదప్పక, చతుస్సముద ముద్రిత మహీవలయంబు నేకఛత్రంబుగఁ బరిపాలించుచున్న నీవొకరిమాట విని నాపాణంబులు దీయనెంచితివన్న సంగతి విని నాకచ్చెరువు జనించుచున్నది.

మ. ఖలులన్, దుష్టుల, నీచమార్గపరులన్ ♦ గారుణ్యహీనాత్ములన్
జడులన్, దైత్యుల లోకకంటకులనున్ ♦ దండించియున్నట్టి చే
తులతో ధర్మపథానువర్తినగునన్ ♦ దున్మాడి రాజిల్లఁగా
దలపోయన్ దగునే; కృపం గనక, స ♦ ద్ధర్మాబ్ధి చంద్రో దయా.

అహో! రామచంద్రా! నీవు నన్నీరీతిని జేయఁదలంచుట నీకు ధర్మమని తోచెనదా ఒకవేళ విశ్వామిత్రుండు నామీఁదఁ గొంకెములు సెప్పినఁ జెప్పుఁగాక! వందలి న్యాయాన్యాయంబుల నరయ నవసరములేదా? ధరాభారావతరణార్థమై విష్ణ్వంశమున నీవు భూతలమున జన్మించితివని దేవతలును, మునులును, సమస్తజనంబును జెప్పుకొనుచుండిరే? అట్టిచో భగవత్స్వరూపుండవగు నీవే ధర్మముదప్పి వర్తించినచో తక్కిన భూపతుల లెక్కయేమి. (ఆలోచించుచున్నాఁడు)

విశ్వా—దేవా! మీరీరీతిని విచారించినందువలనఁ బ్రయోజనమేము



న్నది. ఇందులకుఁ దగిన కర్తవ్యం బేదియైన నాలోచింపవల యునుగదా!

యయా—మంత్రీ! ఇందులకుఁ గర్తవ్యమేమున్నది! రాముండువిశ్వామిత్ర ప్రేరేపితుండై నన్ను జంపుటకుఁగదా ప్రతినదాల్చినాఁడు? దానంజేసి నారాష్ట్రంబునకును జనంబునకును నావంత యుభీతిలేదు. కావున నిప్పట్ల మనము రామునియొద్దకు "నీవు సేయఁబోవు కార్యము ధర్మమైనది కాదనియు, గాధేయుని వచనంబులయందు న్యాయాన్యాయంబుల నరయవలసినదనియుఁ," జెప్పుమని యొక్కరాయబారినిఁ బంపినచో బాగుండును. అందులకాతం డొడఁబడఁడేని, యాతనితోఁ గయ్యంబునకుఁ గడంగుటయే కర్తవ్యము. రణంబున జయాపజయంబులు దైవాధీనంబులు.

చారు—(తొందరగాఁ బ్రవేశించి) ఏమేమీ! నాథా రామునితోడఁ బోరు సేయఁదలంచుచుండిరా!

శా. రామున్, బూర్ణగుణాభిరాము, ముఖ జి ♦ ద్రాకాసుధాంశామిత్ర స్తోమున్, సామజరాజహృత్కుముదినీ ♦ సోమున్, విరాజద్ఘన శ్యామున్, శ్రీ గళవంది తాంఘ్రి యుగళున్ ♦ సర్వప్రపంచప్రభున్ సామాన్యక్షితినాథుగాఁ దలఁచితే ♦ సామర్థ్యమూహింపకన్.

యయా—ఓరమణీమణీ!

తే. గీ. హరియె యీరీతి నవతార ♦ మందెనంచు
నరసియుంటిని; సుందరీ! యతనిమహిమ
దేవతానాథుఁడైనను ♦ దెలియ లేడు
మానవులమాట నింకఁ జె ♦ ప్పంగనేల?

అతఁడు మహాప్రభావ సంపన్నుండనియు, విష్ణుస్వరూపుండనియు నెఱుంగుదునుగాని, యట్టిమహాత్ముండే యధర్మముఁ జేయును

న్నచో నింక నేనేమిచేయవలయును? నేనేమో మహాపరాధము నాచరించితినని గాధేయుం డాతనితోవచించి నన్నుఁ జంపుట కుఁ బ్రతిజ్ఞగావించినాఁడు ఇప్పట్లు నేనేమి చేయవలయును? ఆతనియొద్దకు నొకదూతను బంపి యిది ధర్మముకాదని చెప్పు మందును. అంతల కాతండొడఁబడఁడేని యుద్ధమే చేయుదును.

చారు — నాథా! ఆరామునిఁ జతుర్దశభువనంబు లొక్కటపెట్టుక నెత్తి వచ్చునను జయింపఁ జాలరు.

తే. గీ. బ్రహ్మచేతను నెన్నొ వ ♦ రములువడసి
భువనకంటకుఁడై సట్టి ♦ పౌరసుదిండి
రావణునిఁ దదనుజుని సం ♦ గా మమందు
శౌర్యమునఁ గూల్చె మానులు ♦ సంతసింప.

దాని కేమి? రావణునిఁ దనవాలమునకుఁ గట్టి చతుస్సముద ములయం దును ముంచి లేవనెత్తినవాలిని నొక్కకోలంగూలనేసె.

యయా — రమణీ! అదియంతయు నేనెఱిఁగియేయుంటిని. ఆతని పరా క్రమంబు వర్ణించుటకు సహస్ర ఫణములు దాల్చినభోగీంద్రున కైనఁ దరముగాదు. ఏమైననేమి! ఆతఁడు న్యాయమూరసి, ప తినప్పిడిసచో మంచిదే. లేనియెడల సమరమే కర్తవ్యము. అంత కంటెఁజేయవలసిన కారము నాకంటికి గోచరముకాలేదు.

చారు — నాథా! అబలనైన నేను సాహసమునుబూని పలుకుచున్న పలుకులకు మన్నింపుఁడు. ఆరాముండు శరణాగతరక్షణ బిరు దాంకితుండని వినియుంటిని. అదియునుగాక మనకు బంధుకో టిలోనివాఁడు. మఱియు, వైరికిఁ దమ్ముఁడనియైనను దలఁపక విభీషణున కభయంబిచ్చి రక్షించిన పుణ్యమూర్తి. కావున మీరిప్పట్లు నాతనియొద్దకు స్వయముగ నేగి రక్షింపుమనితత్పా దాబ్జములం బడినచో రక్షింపకయుండునా!



యయా—సతీమణీ! ఇటువినుము. నేనును నొక్కసుకృతి య వంశ పావిర్భూతుండనే. కరమున ఖడ్గముధరించియుండి, నీరుఁడనని లోకమున నించుక ప ఖ్యాతివహించియే యుంటిని. ప్రస్తుతము శ్రీ రాముని విష్ణుమూర్తియను సంగతియటుంచి, యొక రాజుగాఁ దలంపుము. అట్టిచో నేను స్వకులాభిమానమును, పౌరుషమును పరిత్యజించి, రక్షింపుమని యాతని పాదముల కెట్లు మ్రొక్కుదును? (ఇంచుక యూరకుండి) పోనిమ్ము. రాముండు వందనార్హుండనుటకు సందియం బావంతయు లేదు. ఒకవేళ నభిమానమును వీడి యాతనిం జేరి శరణము వేఁడెదను గాక వేఁడినను నన్నుజంపుదునని ప తినదాల్చిన యాతఁడు నన్నురక్షించుట కెట్లు సమర్థుఁడగును? ఇదియంతయునట్టియాస కాని మరియొండుగాదు.

చారు—ఆహా! నేనెంత దురదృష్టవంతురాలను. (చింతించును)

యయా—రమణీ! నీవు చింతించెదవేల? నాకిప్పుడు వచ్చినహాని యేమున్నది?

చారు—నాథా! మీరట్లన్న నేనేమనఁగలను. రాముండు మిమ్ము వధించుటకుఁ బ తినదాల్చెనని విని నంతనే గుండెలు బగిలిపోవుచున్నవి. ఆతనిప తిజ్ఞఁ దీ ప్పుటకుఁ బితామహాదులకైనను దరముగాదు. ఏపాపంబెఱుంగని మీకిట్టి వ తగలుగనుండ నేను చింతింపక యెట్లుండుదునుమీరు లేనిచో నా జగమును దనువును నేల?

యయా—సుందరీ! చింతింపకుము. నిరంతరమును సత్యంబే కాని య సత్యంబెప్పుడును బలికియెఱుంగ. భగవద్భక్తి తప్ప నితరమగు పాపకార్యంబేమియుఁ జేసియెఱుంగ. పెద్దలనుగనిన వందనము జేయుటయే కాని, యవమానించి యెఱుంగ. అట్టిచో నాంకేహాని



యుఁ గలుగదని నెక్కి వక్కాణింపఁగలను. కాని నేను జేయఁ దలంచిన యాగమునకు మాత్ర ము భంగము కల్గెనుగదాయని చింతించుచుంటి.

చారు.—మనోహరా! యాగమునకేమి బదికియున్నచో మఱియొక ప్పుడు సేయవచ్చును. వస్తుతము స్వప్రాణరక్షణోపాయము నరయుఁడు.

యయా.—దీనింగూర్చి విచారింపనేల ?

తే. గీ. భుజబలపరాక్రమంబునఁ ♦ బోరి; ప్రాణ
ములను బ్రోచుకొని వెలయ ♦ వలయుఁగాని
యితరమార్గమేమియు నాకు ♦ నిపుడు దోఁచ
కున్నది మనంబునందు నో ♦ యువిదమిన్న.

ఇంక నేను యుద్ధము సేయుటయందే కృతనిశ్చయుండనై యుంటిని. అంద లి జయాపజయంబులు ప్రథమంబున నిరూపించుటకు మనకుఁ దరముగాదు. రాముని ముందు నిలఁబడి పోరొనర్చుటకు బ్రహ్మా దులకే శక్యముగాదు. అట్టిచో నే ననవెంత ? అయినను క్షతి యధర్మంబు ననుసరించి యతనితోఁ బోరుసల్పెదను. మే మిరుపురమును బోరాటం బొనర్చుసమయంబున నేదేవుఁడైన సద్దు పడి నన్ను రక్షింపకయుండునా! పోనిమ్ము రక్షింపడనుకొమ్ము. రక్షింపకపోయిననేమి! దేహం బెప్పటికైనను మరణంబు నందవలసినదే. అదియుంగాక; విరోధంబుచే నైనను, బంధు త్వంబుచే నైనను, మైత్రిచేనైనను, హరిం గీర్తించినవారు మో క్షపదంబు నందఁగలరు.

తే. గీ. జయము లభియించుననుమాట ♦ సమరమునకు
కల్ల; కైలాసవాసు న ♦ త్కరుణయున్నఁ

బలుకజాలను; గాకున్న ♦ భవ్య రాము
హ స్తమునఁజచ్చి మోక్షంబు ♦ నందఁగలను.

దీనికై నీవు విచారింపఁబని లేదు. మనకొక్క చిన్నికుమారుఁ డుం డెను గదా. వానిని నీవు పెంచి పెద్దవానిగఁ గావించి రాజ్యాభిషిక్తునిఁ జేసి సంతసింపుము. సమ స్తంబును దెలిసిన నీకు నేను జెప్ప వలసిన దేమియు లేదు.

విశా—మహారాజా! ఎంతమాటఁ బలికితిరి?

చారు—మనోహరా! మీమాటలు విని నాహృదయంబు వేయివక్కలుగాక నిలచియున్నది గదా? మీరు లేని నాబతుకేల? ఆరాముండు నన్నుఁగూడఁ జంపినచో బాగుండును గదా! పా ణేశ్వరా! మిమ్ముఁ బాసి నేనొక్క త్రుటికాలంబైనను జీవంబుల భరించి యుండఁజాల. కావున నాయందుఁ గరుణించి మీరు రామచంద్రునితోఁ బోరాటంబునకుఁ గడంగకపూర్వము మీఖడ్గంబుచే నాకంఠంబును నఱకి, యనంతరము కయ్యంబున కేగుఁడు. ఇదియే నాపా ర్థనము.

యయా—ఎంత దారుణ మెంత దారుణము! (మూర్ఛిల్లును)

[తెఱలో గానము వినవచ్చును.

యయా—(మూర్ఛదెలసి) నారాయణస్మరణఁ జేయుచు నెవ్వరో యిట్లు వచ్చుచున్నట్లున్నారు.

విశా—దేవా! బ హ్మమానస పుత్రుండగు నారదమునివలె నున్నాఁడు.

యయా—(పరికించి అవును. విపదాబ్ధిలో మునింగియున్న మనలను తరింపఁజేయుట కేయాతఁడరుదెంచుచున్నాఁడని తలంచెదను.

[నారదుఁడు—ప వేశించును.]

నార—(తనలో) ఆహా! నాకుఁ గలహము పా ప్తింపనిదినం బుపవాసంబుతో సమానము. ఈసభ నెక్కడను గలహంబులు వీక్షిం



పకయుంటచే నాకేమియుం దోంచకున్నది. ఎక్కడనైనను నెవ్వారి కైనం గలహంబుబెట్టి యానందింతు నన్ను నేమియుం గారణం బు గనుపింపకయున్నది. (ఆలోచించి) సరే! జ్ఞప్తికివచ్చినది. యయాతి తన్నవమానించెనని విశ్వామిత్రుండలిగి రాముని యొద్దకేగి కొండెంబులను జెప్పి యయాతిని జంప రాముని చేం బ తినబట్టించెను గదా? కానిమ్ము. ఇప్పుడు నేను యయాతి యొద్దకేగి యాతని నెట్లయిన హనుమంతుని శరణంబు బొందు మని చెప్పెద. దీనిం జేసి, హనుమంతునకును, రామునకును బోరాటంబు సంభవించుటయు, విశ్వామిత్రుని ప్రతిజ్ఞ భంగ మగుటయుం దటస్థించును. ప్రస్తుత మింతకంటె నానందదాయ కంబగు కార్యమింకొక్కటి గానుబడుటలేదు. (ఎదుటంజూచి) అదుగో! యయాతినృపుండు భార్యాసమేతుండై రాముని ప్రతి నవిని కాంబోలు విచారించుచు నిచ్చట నున్నవాండు. ఈతనిం జేరి ధైర్యముం జెప్పెద. (ఇంచుకనడచును)

యయా—(నారదుని సమీపించి) మునీంద్రా! వందనములు.

చారు—సంయమీంద్రా! భవదీయ పాదపంకేరుహంబుల కీదీను రాలు నమస్కరించుచున్నది.

నార—దీర్ఘసుమంగలీభవ!

చారు—భవదమోఘాశీర్వచనంబు ఫలించుంగాక!

(అందఱును నాసనంబుల నధిష్ఠించుచున్నారు)

నార—రాజా! నీవు నేడు మిగుల చింతాక్రాంతుండవై యున్నట్లు తోంచుచున్నది. అందులకుం గారణంబు వినవగుదునేని చెప్పం గోరెద.

యయా—మహానుభావా! త్రిలోక సంచారివగు నీకుం దెలియని విషయంబు లీచతుర్దశభవనంబులయందెచ్చటనైన నుండునా

నా సంతాపంబునకుఁ గారణంబు నీవెఱింగియుండియు నా నోట వినఁదలంచి యడుగుచుంటివని తలంచెదను.

నార—(దివ్యదృష్టిఁజూచి) రాజేంద్రా ! నీసంతాపంబునకుఁ గారణ బంతయు దివ్యదృష్టి నెఱిఁగితిని. విశ్వామిత్ర ప్రేరేపితుఁడై రాముఁడు నీయెడలఁ జేసినప్రతిన కేకదా నీ వింతచింతించుచుంటివి.

చారు—అవును మహాత్మా! మహావిపదాంబురాశిలో మునిఁగి మార్గమేమియుఁ గానక యట్టిటుఁ గొట్టుకొనుచున్నమాకు నౌకవై యుద్ధరింపుము. నీకిదేవందన మాచరించెదను.

నార—నృపాలా ! రాముని ప్రతిజ్ఞ వింటివిగదా! అందులకు నీవేమి కర్తవ్య మాలోచించితివి.

యయా—మహాత్మా ! ఇట్టి యధర్మకార్యము సేయుట తగదు గావున ప్రతిన వీడుమనియు, నందుల కంగీకరింపనిచో యుద్ధమునకు సంసిద్ధుఁడనై యుండుమనియుఁ జెప్పుటకు రామునికడ కొక దూతను బంపఁదలంచితిని. అతఁడు న్యాయమారసి ప్రతిన వీడిననసరే లేకున్నచో సమరము సేయుటయందే నిశ్చితాభిప్రాయుఁడనై యున్నాఁడ.

నార—(నవ్వుచు) ఎంత వెఱ్ఱివాఁడవు ! రామునితో యుద్ధము సేయుట కుఁ దలంచితివా? నివాతనితోఁబోరిజయంబుఁ గాంచఁగలవా.

యయా—మహాత్మా ! జయంబు గాంచఁగలుగుదునను ధైర్యంబుతో నేనది తలపెట్టలేదు. క్షత్రియధర్మంబుగావున నేనట్లు సేయఁ దలంచితిని.

చారు—దేవా ! నాపతిప్రాణంబులు రక్షించుకొను నుపాయం బేది యైనఁ జెప్పి మమ్ముద్ధరింపుము.

నార—రాజా ! నిన్నుఁ జూచిన నాకు మిగుల జాలికలుగుచున్నది. విష్ణుమూర్తియే రాముఁడై భూభారంబు బాప, భాస్కరవంశం

బునఁ జా విర్భవించి లోకకంటకులైన రావణ కుంభకర్ణాదు లను ఘోరసంగా మంబున నుక్కడగించి మునులను, దేవత లను నుద్ధరించినాఁడు. విశ్వామిత్రు ని ప్రేరణచే నీయెడల నిట్టి ప్రతిజ్ఞ దాల్చెనుగాని లేకున్నచో నిరంతర ధర్మవ్రతాచార పారీణుండవగు నీజోలి కతఁ డరుదెంచువాఁడు కాఁడు. ఆరఘు నందనుఁడు బూనిన ప్రతిజ్ఞను హరిహరాదులైనను దప్పింపఁ జాలరు. సంగరంబున నాతని యెదుట నిలచుటకు రుద్రు నకైనను శక్యముగాదు. అట్టిచో నీవేడ ? ఆతనితో యుద్ధము సేయుటేడ ? ఆ ప్రయత్నంబును మానుము.

యయా—మునీంద్రా ! అది మాని నేను జేయవలసినకార్య మేది?

నార—నేను జెప్పినట్లు చేసినచో నిక్కముగ నీవు రక్షింపఁబడుదువు. అందులకావంతయు సందియము లేదు. నేను జెప్పఁబోవు యుపాయంబుఁ దప్ప నీవు రక్షింపఁబడుటకు వేరొకమార్గంబే మియు లేదు.

యయా—నాయందుఁ గరుణఁబూని నన్నుద్ధరింపఁ దలంచిన నీయా నను సరింపక యుందునా ?

నార—ఇటువినుము. హనుమంతుఁడు రామునకుం గడుఁగూర్చు భక్తుం డని నీ వెఱుంగుదువుగదా ! ఆతఁ డిప్పుడు కిష్కింధాపుర ప్రాంతవనంబున నున్నవాఁడు. ఇప్పట్ల నీవాతనియొద్ద కేగి శరణం బొందితి వేని నీక భయమిచ్చి రాముని బారిఁబడకుండ రక్షింపఁగలఁడు.

యయా—మహాత్మా ! నీపలుకులు నాకు మిగుల నచ్చెరువుఁ బుట్టించుచున్నవి. నీవు హరిభక్తుండవగుటం జేసి రామునకు నన్నొప్పగించు తలంపుతో హనుమంతుని జేరుమని పలికెతి



కాకున్నచో రామభక్తుండగు హనుమంతుండు నన్ను రక్షిం
చునా ? ఇది వట్టిమాట. మునివర్యా ! పొమ్ము. నాగతి
యెట్లున్న నట్లగును.

నార — రాజా ! నేనసత్యము పలుకలేను. హనుమంతుఁడు శరణాగత
త్రాణ బిరుదాంకితుఁడు. నీవిప్పుడచ్చోటికేగి ముందుగ
"శరణు శరణ" ని యాతని పాదంబులపైఁ బడినచో నభయ
మిచ్చితినని పలుకును అనంతరము సంగతిఁ దెలుపుము. అతఁడు
నిన్ను రక్షించితీరును. నాపలుకులు విశ్వసింపుము. హనుమంతు
నియందున్న కృపచేనైనను రాముండు నిన్ను రక్షించి తీరును.

యయా — మునీంద్రా ! నీపలుకులు విశ్వసింపవచ్చునా ?

నార — సందియము లేదు. నేఁడే ప్రయాణమై పొమ్ము. నేనేగెదను.

(నిష్క్రమించును)

యయా — రమణీ ! మునీంద్రుని వచనానుసారినై హనుమంతుని సన్ని
ధి కేగుటకుఁ దగిన ప్రయత్నంబు జేసికొనవలెను రమ్ము.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది తృతీయాంకము.





శ్రీ

# హనుమద్రామ సంగ్రామము

## చతుర్థాంకము.

కిష్కింధాపుర ప్రాంతోపవనము,

[హనుమంతుఁడు ప్రవేశము]

హను—(తనలో) ఆహా! రఘునందనుని దివ్యపాదారవింద సందర్శనం బాచరించి పెక్కు దినంబులయినది. నాచిత్తం బాతనిఁజూడ మిగుల ద్వత్తర మందుచున్నది, ఆతని పాదచింతనంబు లేక నే నొక్క దినంబైనను బ్రతుకగలనా. భళిరా! రామభక్తి యెంత కుఁ జాలదు. సంసారవారాశిలో మునిఁగి, దరిగానలేనివారికి మార్గంబు జూపునది యదియేకదా. ముక్తికాంతా సంగమంబును గూర్పఁ జాలునది యదియేకదా పాపంబులఁ బోఁగొట్టి, సకల సౌభాగ్యంబుల నొడఁగూర్చి, దారిద్ర్యవిధ్వంసంబు గావించి యశముఁ గూర్చునదియు నదియేకదా. వేయేల! శ్రీ రామభక్తికి మించినది వేరేమియు లేదు.

శా. శ్రీ పద్మోద్భవశంకరాద్యమర సం♦సేవ్యంబు సుజ్ఞాన స
ద్దీపాంకూరము దుష్టగర్వజనధా♦త్రీ నాథ నిర్మూలముక్
బాపారణ్యదవాగ్ని మోక్షపదవీ♦ప్రాసాదమార్గంబు; ల
క్ష్మీపద్మాయుతలోచనాథవృఘున♦శ్రీమంత రాజంబిలక్.

మ. దురితంబుల్ పదివేలొనర్చినను దో♦డ్తో నొక్కమారైన; భా
స్కరవంశా! శశాంక! శర్వదకలం♦కా రామ! శ్రీ రామ! యు



చు రహిఀ జేర్కొని సంతనే మిగుల సం♦శుద్ధాత్ములైయొప్పుచుం
డురు భక్తౌఘము భూతలంబునను సం ♦ తోషప్రభావాఢ్యులై.
ఆరామనామమహిమం బాశంభుఁడే యెఱుఁగునుగాని తక్కినవారె
ఱుంగ సమర్థులుగారు.

[అంగదుఁడు ప్రవేశించును.]

అంగ—(తనలో) ఇదుగో హనుమంతుం డీవనంబున నేదియో చేయు
చున్నాఁడు. (పరికించి) చేయుట కేమున్నది. నిరంతరమును రా
మనామచింతనమే యీతనికి భోజనము.

మ. ధరణీభార నివారణంబునకు దై ♦ త్యశ్రేణినిం గూల్ప భా
స్కరవంశంబున జన్మమందిన మహా ♦ కారుణ్యతేజోనిధిన్
హరి; సీతాధవు; రాము; సంతతమున్ ♦ ధ్యానించి రాజిల్లవా
నరుఁ డీకేసరిపుత్రుఁ డేమి, తొలిజ ♦ న్మంబందు గావించెనో?

ఆరఘునందనుని సేవించిన వానరులనుగుచూ కందఱికిని నిట్టి ప్రభా
వము గలిగెనా. (హనుమంతుని సమీపించి) ఆంజనేయా!
ఒంటిగ నిచ్చోటఁ గూర్చుండి యేమిసేయుచుంటివి?

హను—చేయుట కేమున్నది. రామనామచింతనంబు దప్ప నాకితర
మగు కార్యమేమియు లేదుకదా!

అంగ—నీ వెప్పుడుచూచినను రామ రణంబు సేయుచునే యుందువు.
ఆశ్రీరాము కారుణ్యరసంబు గోలుటకు నీవు తొలిజన్మంబున
నెట్టిపూజలు గావించియుంటివోకదా! రామభక్తిపరాయణుం
డవగు నీప్రభావంబు వర్ణింప శేషునికైనను దరంబుగాదు.

హను—అంగదా! ఆరామనామచింతనం బెంతకుఁ జాలదు.

తే. గీ. పాపముల నెల్లచోఁ ద్రోలు ♦ భవ్యసుఖము
పైప నాస గలుగనీదు ♦ మహితమోక్ష

పదవి నొసఁగూర్చు; యశమిచ్చు ♦ భక్తిమీర
రాముఁగొల్వఁజాలిన, భక్త ♦ రాజికెపుడు.

అంగ—అందుకు సందియం బావంతయు లేదు.

హను—చూడుము. నేనును మీవలె నొక్కవనచరుండనే కాని సాక్షా
ద్విష్ణుస్వరూపుఁడగు రామపదపద్మారాధనపరుండనై యుంట
చేతనే నాబలశౌర్యంబు లింతశోభ కెక్కినవి.

సీ. శ్రీరాముదయచేత ♦ సీతాసతినిఁ గాంచ
నంభోధిలఘించి ♦ యలరినాఁడ
ఆతనికృపచేత ♦ నమరారిపుతుఁడౌ
శత్రునిదర్పంబు నడఁచినాఁడ
కాలకాలునిబోలు ♦ కాలనేమిని రాము
దయచేతఁ దృటిలోన ♦ దంచినాఁడ
సౌమిత్రి మూర్ఛకై ♦ సంజీవికుధరంబు
నిచ్చమైనానాఁడు ♦ దెచ్చినాఁడ
తే. గీ. వేయునేల; యెయ్యదిచేసి ♦ వెలసియున్న
భవ్యగుణధాము శ్రీ రాము ♦ భవవిరాము
సూర్యవంశాబ్ధి సోము స ♦ త్సుగుణకాము
కరుణచేతనే యంచును ♦ నరయుమయ్య.

నాబలంబునకును, నామహామహిమంబునకును, రఘునందనుని దివ్యకృ
పయే కారణము.(ఇంచుకయూరకుండియాలోచించుచున్నాడు)

అంగ—హనుమంతా! నీ వేదియో దీర్ఘాలోచనము సేయుచున్న
ట్లుంటివే.

హను—ఏమియును లేదు. శ్రీ రామపాదారవింద సందర్శన మాచరించి
పెక్కుదినంబులైనది. (కన్నుదురుట నభినయించి) ఏమిది! శ్రీరా

మనామంబు స్మరించినంతనే నాయెడమకన్ను దురుచున్నది ?
ఇందులకేమి కారణమోకదా !

అంగ—ఇట్టి నిమిత్తంబులతో నీకేమిపని యున్నది ?

హను—అట్లుగాదు. ఏకారణంబుచేతనో కాని నాయెడమకన్ను మిగుల నదురుచున్నది. ఏమియుఁ దోఁచకున్నది.

శా. సాకేతంబున జానకీ రమణుఁడో ♦ సౌభాతృవర్గంబుతోఁ
బా కళ్యంబుగ నుండునే కుశలియై ♦ రామాంగజుల్ తల్లియా
భూకన్యామణితోడ నుందురుగదా ♦ పూర్ణానుమోదాత్ములై
నాకున్ దోఁచక యున్న దేమియు; మహా ♦ నందంబు నన్బాసెడిన్.

ఇప్పుడు నాకడుపంతయుఁ జేయివెట్టి కలఁచినట్టులున్నది. ఇందులకేమి కారణంబుండునో దెలియకున్నది.

అంగ—హనుమా ! దీనికి నీవు విచారింపవలదు. రామాదులందఱును నయోధ్యయందుఁ గుశలులై యుందురు. అందులకేమియు సందియముండదు. ఎందులకో కాని చిత్తంబు కొంచెము వికలతఁ జెందియుంటచే నట్లుఁ దలంచుచుంటివిగాని మఱియొండు గాదు. చిత్తంబును బదిలపఱచుకొని గృహంబున కరుదెంచి యొక్కించుక విశ్రమింపుము.

(తెఱలో)

అయ్యో ! శరణాగతతాణబిరుదాంకితుండును, రామభక్తుండును నగు హనుమంతుఁ డెచ్చట నున్నవాఁడు ? (ఇంచుక యూరకుండి) ఆకనుపడువనంబున నంగదునితో నున్నవాఁడనియా చెప్పుచుండిరి. సరే. నేనాతని నిప్పుడే సందర్శించెద.

హను—అంగదా ! ఎవ్వరో నన్నడుగుచు నిట్లు వచ్చుచున్నట్లున్నది.

యమా—(ప్రవేశించి తనలో) ఆహా ! ఆరాముండు నే నీకిష్కింధ జేరులోపుగనే యరుదెంచి తనప్రతిజ్ఞఁ దీర్చుకొనునేమోయను

భయంబునఁ గడురయంబునఁ బరుగులెత్తుచు వెనుక తిరిగిచూ
డక యిప్పటికిచ్చటికిఁ జేరుకొంటిని. (ఎదుటఁజూచి) అదుగో హను
మంతుండచ్చట నంగదునితో నేదియో భాషించుచున్నాఁడు.
ఇంక నే సీతనిఁజేరి శరణంబు వేఁడెదను. (ఇంచుక యాలోచించి)
రామభక్తుండగు సీతఁడు నాకు ముందుగ నభయమిచ్చిన నిచ్చుఁ
గాక. నా సంగతి వినిన యనంతరంబున రామునియందుండు భ
క్తిచేఁ దన ప్రతిన వీడి యాతనికి నన్నప్పగించునేమో, యను
సందియము నాడెందంబునఁ గలుగుచున్నది. ఈతఁ డంతయధ
ర్మపరాయణుఁడా? చేసిన ప్రతిజ్ఞకు భంగము గావించి ప్రవ
ర్తింపఁదలచునా? అట్లు జేయువాఁడు గాఁడు. ఈతఁడు నాకుఁ
దప్పక యభయంబిచ్చి తీరును. రాముండును సీతనియందున్న
దయచే నన్ను రక్షించితీరును. ఒకవేళ రాముండు నన్ను రక్షిం
పనని చెప్పినచో సీతఁడేమి సేయునోకదా! చేయుట కేమున్నది.
రామునితో నన్ను రక్షించుట కీతఁడు సమరమే చేసితీరును.
సమరమన్న నాకును సందియంబగుచున్నది. ధరాభారావతరణా
ర్థమై జన్మించి లోకవిద్రావణుఁడగు రావణునిఁ బుత్రామాత్య
భృత్యాదివర్గంబుతో నేలంగూల్చిన రామునితో హనుమంతుఁ
డు పోరుసలుపఁగలఁడా? (ఆలోచించి) ఈతఁడు మాత్రము సా
మాన్యుఁడై యుండెనా? రుద్రుని యంశంబున జనించినాఁడు.
కాకున్నచో రామరావణ యుద్ధంబున నీతఁ డంతప్రభావం
బెట్లు చూపఁగలఁడు? కావున నావిషయమై నేను సందియంబంద నవసరము లేదు. (ఇంచుక యూరకుండి) ఇంక నేను
జాగు సేయనేల? నారదమునీంద్రుఁడు వచించిన తెఱంగున, సీత
ని పాదాబ్జంబులఁబడి శరణంబు వేఁడెద. (ఆలోచించి) నే సీతని శ
రణంబు నందవలసినదేనా? సాటికపితి యపభ్రంశు నా[illegible]

7/78

సేయనుండెనుగావున నీవభయంబిమ్మని నీరచరితుఁడనైననేను బలుకుట కెట్లు సమ్మతింతును. సమ్మతింపక చేయునదేమున్నది? ఈమార్గంబున గాక వేరొక మార్గంబున నీవు ప్రాణంబులను రక్షించుకొనఁజాలవని మునివరుండు నొక్కి వక్కాణించెనుగదా! అయినను నిక్కార్యంబునక్షత్రియధర్మమునకు విరుద్ధమేమున్నది? తాను శక్తుఁడై యుండు సమయమున శత్రురాజులతో సంధిజేసికొనుటగాని, లేక యితరుల సహాయ మపేక్షించుట గాని క్షత్రియధర్మమేకదా. (తన్నుద్దేశించి) ఓయయాతీ! నీయవస్థ నేఁటికిట్లు వచ్చినది. ఇంక నీవు సందియమందకుము.

మ. అభిమానంబునుజంపుకొమ్ము, సమర ♦ వ్యాపారముల్ మాను; వీతభయోదేకమువీడు; ధైర్యమును జి ♦ త్తంబునుమనంజేర్చి వేయభయంబమ్మని యంజనీసుతుని పా ♦ దాబ్జంబులన్ మొక్కు, సచ్ఛుభముల్ చేకురు; భీతిపోవు; గనుసం ♦ తోషంబుచేకూరెడిన్.

ఇంకసందియంబందనేల! తొందరగానేగి హనుమంతుని పాదంబులపైఁబడెదను. (తొందరగా నడచి హనుమంతుని చరణంబులపైఁబడి) శరణాగతత్రాణబిరుదాంకితా! రామకార్యధురంధరా! శరణు. శరణు. (పాదంబులనుగట్టిగాఁ బట్టుకొనును)

హను—(తనలో) అక్కటా! ఇతఁడెవ్వరో నృపాలుండు. ప్రాణభీతార్తుఁడై నాశరణంబుఁబొందినాఁడు. (ప్రకాశముగా)

మ. అరివంశాబ్ధ తటాకమున్ గలఁచుదై ♦ త్యానేకపానీకసంహారుణుఁ డాహారివచ్చుఁగాక; జితది ♦ క్ప్రాంతుండునైనట్టి శంకరుఁడేవచ్చునుగాక; దేవతలరా ♦ కన్ జూచి ముల్లోక జిత్వరులే తెంతురుగాక నీకభయహ ♦ స్తంబిచ్చినాఁడన్నృపా.

ఓయీ! నృపాల! భయంబు విడిచిలెమ్ము.

యయా—(హనుమంతుని చరణంబులపై నుంచిలేచి తనలో) అమ్మ య్యా! ఇప్పటికి ధైర్యమువచ్చినది. శరణాగతరక్షణ బిరుదాంకితుండన నీతనికే చెల్లును. (ప్రకాశముగా) మహాత్మా! ఆంజ నేయాభిధానా! నీ నిర్హేతుక జాయమాన కరుణ కనేకవందనంబు లర్పించుచున్నాఁడను.

అంగ—(హనుమంతునిఁజూచి) హనుమంతా! ఈతఁడెవ్వరో; ఎవ్వరి వలన భయముగలిగి నీశరణమందెనో ముందెఱుంగకుండ నభయంబిచ్చితివి. దీనంజేసి మనకేమిహాని వాటిల్లునోకదా.

హను—అంగదా! నేనును నదియే యాలోచించుచుంటి. అభయ మిచ్చితిని. రోటఁ దలఁదూర్చి రోకటిపోటునకు వెఱువనేల? ఈతనియుదంతం బేమియో యరయుదము. (యయాతితో) ఓయీ! నీముఖంబుజూడగా నీవు చెప్పకుండనే రాజువని తెలియుచున్నది. నీ కెవ్వరివలన ప్రాణభీతిగలిగి నాశరణుఁజొచ్చితివి? నీ యభిధానంబేది? నీ వేలురాష్ట్రంబెయ్యది? నీ సంగతియంతయు సవిస్తరంబుగఁ జెప్పుము.

యయా—(భయము నటించును)

అంగ—రాజా! నీవు భయ మందనవసరము లేదు. ఈతఁడు నిన్ను రక్షింతునని యభయ మొసంగెనుగదా? ఇంక నీవు భయంబువిడిచి నీ నిజసంగతిఁ దెలుపుము.

హను—సందియంబందక చెప్పుము. (పీఁపుఁ జఱచుచున్నాఁడు)

యయా— తనలో) నా నిజసంగతి వీరికిఁ జెప్పక తప్పదు. చెప్పినచో నీతఁడు న్నేమి సేయునోకదా! అభయమిచ్చి నన్ను విడిచిపెట్టునా? ఈతఁడట్లెన్నటికిని జేయఁడు. కావున విచారంబుదక్కి చెప్పెద. (ప్రకాశముగా హనుమంతునిఁ జూచి) మహాత్మా!

హనుమంతా! సూర్యకులపా విఖ్యాతుండను. యయాతి యభి
ధానంబున దనరుచున్నాను.

హను—(సంతోషముతో) ఓహో! నారాధ్యదైవంబయిన శ్రీరాముండు
జనించిన సూర్యవంశంబునందే జనించుటం జేసి నీవు మాకెంత
యు బూజార్హుండవు. ఇంతవరకును నిన్ను సామాన్యనృపతిగా
భావించితిని మన్నింపుము. ఇట గూర్చుండి నిభయకారణం
బును జెప్పుము.

యయా—రామదాసా. ఏమని చెప్పుదును. నేనొకయాగంబుసేయదల
పెట్టి, సకలమునులను దద్విధానంబు నెఱింగించుటకు రా
వించితిని.

హను—అది మంచి కార్యమేకదా! తరువాత.

యయా—అట్లురు దెంచి మునివర్యులనందఱిని నర్ఘ్యపాద్యాదివిధులం
బూజింపదలంచి ప్రథమంబున వసిష్ఠుని బూజించితిని.

హను—బ్రహ్మఋషియు, నిక్ష్వాకువంశజులకు గురుండును నగునా
తండట్లు పూజింపబడ నర్హుండే. తరువాత నేమైనది?

యయా—వసిష్ఠుని బ్రథమంబున బూజించితినని విశ్వామిత్రుండలిగి
యాసభను విడిచిపోయెను.

హను—మొదటినుండి విశ్వామిత్ర వసిష్ఠులకుసహజవైరమున్నదిగదా!
వైరాగ్యములేని యోగంబేల తరువాత,

యయా—తరువాత, యాగప్రదేశంబును జూచుటకరణ్యంబునకేగి,
యందలి దుష్టసత్త్వములను దునిమి యొకవృక్షముక్రింద విశ్ర
మించి యుండుతఱిని, నాకంటికొక వ్యాఘ్రము గనుపించెను.
న్నేనది చూచి వెంటనే బాణంబునువిడిచితి. అంతలో నయ్యది
హరిణముగా మారినది. ఆసమయమున విశ్వామిత్రుండు
నాయొద్ద కరుదెంచి కోపావేశమున, నాయాగము హరిణమును

వధించితివి గావున నీయంతము జూచి తీరుదునని దారుణమైన
ప తినదాల్చెను.

హను—అక్కటా! తాపసులు ధర్మపరాయణులగు రాజులపై దమ
కోపము జూపింతురా ! తరువాత నేమిజరిగినది.

యయా—మహానుభావా । తరువాతసంగతి నేమని వక్కాణింతును.
విశ్వామిత్రుండు రాముని సన్నిధి కేగి నాపై గొండెములను
జెప్పి—(అని యూరకొనెను

హను—యయాతీ ! చెప్పుము. సందియ మందెదవేల ?

యయా—నను వధింపఁ బ తినపట్టించినాఁడు.

హను—హా ! (మూర్ఛిల్లి లేచి) ఓనృపాలా ! నీవు నన్నెంతయు మో
సపుచ్చితివి. రాముండు నిన్నుఁజంపుటకుఁ బ తిజ్ఞఁ బట్టుటయు
నేను నిన్ను రక్షింతునని యభయంబిచ్చుటయునా. అన్నా !
నేనెంత మోసపోయితిని. ఈసంగతి నీవు ముందే నాకేల చె
ప్పకపోయితివి ? అట్లు చెప్పియుంటివేని నేను నీకభయంబిచ్చి
యుందునా ?

యయా—మహాత్మా ! క్షమింపుము. ముందుగఁ జెప్పినచో నభయం
బొసంగవని తలంచియేకదా యిట్లు చేసితిని.

శా. వాలాయంబుగ నన్ను గాతువనుచున్ ♦ భావించి నేనిట్లు నీ
పాలన్ జేరితినయ్య యిప్పుడు కృపా ♦ పాథోనిధీ ధీనిధి
పాలన్ ముంచిన నీటముంచిన సరే ♦ భారంబు నీదాట నా
కేల వేరొకచింత జెంద మదిలో ♦ నింకన్ మరున్నందనా.

హను—అక్కటా ! అంగదా ! వింటివికదా. దైత్యవంశదావానలుం
డును, నిరంతర కరుణామయుఁడును, శరణాగత బిరుదాంకితుం
డును, త్రిజగద క్షదక్షదీక్షాకరుండును, నాకు దైవమును

నగు రామచంద్రుండు జంపుదునని ప్రతిజ్ఞఁబట్టఁగా, నేనా నిన్ను రక్షించువాఁడను నాబలమునకును, శౌర్యమునకును, ప్రతాప మహిమములకును గారణభూతుండైన రామునితో నాకు విరోధము గల్గెనుగదా? ఓనృపాలా! ఎవ్వాని కారుణ్యారసము నాపై వెల్లివిరి యుటంజేసి, సీతాన్వేషణమునకై శతయోజనాయతంబగు వారాశిని నొక్క కాల్వకరణి లంఘించి లంక జొచ్చితినో, యెవ్వాని దయ యుంటచేత సురాసురులకైనను దేరిచూడశక్యముగాని దశకంధరసుతుండైన యక్షుని ఘోరసంగ్రామమున దునుమాడఁ గలిగితినో, యేమహాత్ముని కృపాదృష్టులకుఁ బాత్రుండనగుటంచేసి, మాయావిద్యాధురంధరుండైన కాలనేమిని ద్రుటిలో నేలంగూల్చితినో, యేదివ్యస్వరూపిని దాక్షిణ్యము నాపైఁ బ్రసరించుటంజేసి, సౌమిత్రి నిమూర్ఛఁదేర్చుటకై సంజీవిని పర్వతమును నాభుజస్కంధమునందుఁ బెట్టుకొని సూర్యోదయము గాకమునుపు చనుదెంచి సౌమిత్రి ని రక్షించితినో యట్టి శ్రీ రాముండు నేఁడు నీమూలముననాకు విరోధి యయ్యెనుగదా!

ఉ. ఏవిభు దివ్యమౌ మహిమ ♦ నెవ్వరు గాంచఁగఁ జాలరుం ద్రు రా
దేవకిరీటరత్నరుచి ♦ దీపితపాద సరోజుఁ డైన సీ
తావిభు నాశ యించితిగ ♦ దా యని సంతస మందుచుంటి గా
సీ విధియిట్లు సేయునని ♦ నేఁ గలనైనను నెంచనైతిఁగా.

అంగ—హనుమంతా! గతించినదానికిఁ జింతిచినందువలనఁ బ్రయోజనం బేమియున్నది? ముందు కర్తవ్య మాలోచింపుము.

హను—(ఎదుటఁజూచి అదుగో! సుగ్రీవుఁ డిట్లు వచ్చుచున్నాఁడు. అతని కీయుదంతము దెలిపి యనంతరము కర్తవ్య మాలోచింప వచ్చును.

యయా—దేవా! హనుమంతా! ఏమైనను నభయము నొసంగి నన్ను విడనాడఁగూడదని విన్నవించుకొనుచున్నాను.

హను—రాజేంద్రా! నీవు భయమందఁ బని లేదు. అస్మదీయ భుజబలరక్షితుండవై యున్నంతవఱకును నిన్నెవ్వరుఁ దేఱిచూడఁ జాలరు.

యయా—సుగుణచరితా! నాకదియే కావలసినది.

సుగ్రీ—(హనుమంతునిఁ జూచి) హనుమంతా! మిట్టమధ్యాహ్నమైనను మందిరంబున కరుదేరక యీవనంబునందుంటివేల ప్రక్కనున్న యయాతిం జూచి) కోటిసూర్యప్రభా తేజోవిరాజమానుండై యొప్పుచున్న యీపురుషపుంగవుం డెవ్వరు?

హను—(విచారించును.)

సుగ్రీ—కుమారా! అంగదా! ఈతఁడేందులకో విచారించుచు నాప్రశ్నంబున కుత్తరుపీయకున్నాఁడు.

అంగ—తండ్రీ! ఈతండు యయాతి యనునృపతి. విశ్వామిత్రు నకెగ్గు సల్పుటచే నతని ప్రేరణంబున రాముండీతనిని జంపఁ బ్రతిజ్ఞఁ దాల్చినాఁడు. ఆసంగతిఁ దెలియక హనుమంతుం డీతనిని రక్షింతునని యభయమిచ్చినాఁడు.

సుగ్రీ—అన్నా! ఎంతపని జరిగెను.

హను—వనచరేంద్రా! సుగ్రీవా!

తే. గీ. మొసలికోరలఁ జిక్కియు ♦ భూమియందుఁ
బ్రాణములఁ బాసిపోవక ♦ బ్రతికియుంట
భూరిగుణుఁడైన శ్రీరామ ♦ మూర్తితోడఁ
బగనుబూనుటకే కదా ♦ మదిఁదలంప.

తే. గీ. రామశ్రీ రామ జయరామ ♦ రామరామ
యనుచు నొకమారు మదిలోన ♦ ననిశయంత

పాపములనెల్ల పడనాడి ♦ భవ్యమోక్ష
పదము; మానవానీకంబు ♦ బడయగలదు.

అట్టిచో నన్నెన్నియో విధంబులు గాపాడి రక్షించుచున్న శ్రీరాము నితో వైరము పాటించెనుగదా! ఇందులకు నేనేమనిచింతింతును ?

తే. . అభయమిచ్చితి రక్షింతు ♦ ననుచు జెప్పి
యిందులకు నేను దప్పిన ♦ నెల్లజగము
లాడు; దుష్కీర్తిపాలౌచు ♦ నలరవలయు
నేమిసేయుద మిప్పట్ల ♦ నెంచిచెపుమ ?

సుగ్రీ — హనుమంతా! దీనికై విచారింపవలదు. ఏది యెట్లయినను సీతని రక్షణము మనకవశ్యమై యున్నది. మందిరంబున కేగి దీనివిషయమై సంపూర్తిగ నాలోచింతము. (యయాతింజూచి) నృపాలా! రమ్ము.

ఇది చతుర్థాంకము.





లక్ష్మ—అగ్రజా! వినలేదు. నేనాసమయమున మందిరమున లేనైతి.

రాము—ఈవిశ్వామిత్రుని మూలమున, నిరంతరమును మనక్షేమము విచారించువాడును, నస్మత్పాదచింతనముదక్క నన్యచింతను మనమున బవేళ పెట్టనివాడును, సీతాన్వేషణమునకై నరుడుగాని వానరుడుగాని దేవతలలో నెవ్వరైనగాని చేయ నశక్యమైన మహాత్కార్యములంజేసి తన స్వామిభక్తిని నాయందు వెల్లడించి మనవంశమును నిలబెట్టినవాడును, మున్ను సంగామమున రావణునిశక్తిచే నీవు మూర్ఛమునింగిన సమయమున సంజీవికుధరము బెకలించుకొని వచ్చినవాడును, నగు హనుమంతుడు నేటికి విరోధియయ్యెనుగదా యని చింతించుచుంటి.

లక్ష్మ—అన్నా! అదియేమికారణము.

రాము—ఆయయాతి నాకు భీతిల్లి హనుమంతుని యొద్దకేగి శరణమందగా నాతడు రక్షింతునని యభయమిచ్చెనట.

లక్ష్మ—ఔరా! ఏమిదీ! హనుమంతుం డిట్టియకార్యముసేయునా.

శా. ఔరా భీతినిబూనకే; యభయ మా ♦ హన్మంతుడే యిచ్చెగా
ఘోరాజిన్ దశకంఠుగూల్చి యసురుల్ ♦ ఘోషింపగాజేసి వం
దారుల్ సంస్తుతిసేయగా దనరు నీ ♦ ధైర్యంబు, శౌర్యంబు గ
న్నారంగాంచియు నేటికిన్మఱచెనే ♦ యాత్మన్మహాగర్వమై.

కానిమ్ము. అందుకు దగిన ప్రతిఫలము నాత డందగలడు. అన్నా! ఇంక యుక్తాయుక్తవిచారణంబెందుకు? నీ వావిశ్వామిత్రునితో యయాతిని వధింతునని ప్రతిజ్ఞవహించితివి. అందులకు దప్పినచో ధర్మవిరుద్ధమగును. కావున నీప్రతిన బూర్తిసేయుటకై యత్నింపుము.

రాము — అవును. అందులకు నేను సందియమందుచుండుట లేదు కాని యిప్పు డాయయాతి హనుమద్భుజబల పరిరక్షితుండై యొప్పు చున్నాడు. ఇందుల కేమి మార్గ మాలోచించుదము.

లక్ష్మ — సోదరా! దీని కాలోచింపనేల.

తే. గీ. కన్నుగానక యిట్టుల ♦ ఖండగర్వ
మూని, కానికార ముజేసి ♦ యొప్పుచున్న
మారుతీకుమారు వేగ ♦ బవరమందు
దాకి; నిర్జించుటే యిప్డు ♦ దగును మనకు.

ఆత డీరీతిగావించుట సు గ్రీవుని యనుమతి యుండితీరును. వారు మున్ను వాలి వధకై మనలను నక్కవినయమున సేవించిరి. కాకున్నచో నిట్లు సేయుదురా!

ఉ. సందియమండ కింక ఘన ♦ సంగరరంగమునందు నింక నా
నందముతోడ వేగ కపి ♦ నాథుని వానరసంయుతంబుగా
ముందల వాలియున్న ల ♦ ముల్ కన బంపుము శౌర్యమేర్పడన్
డెందమునందు నిట్టుల క ♦ డింది విచారమునంద నేటికిన్.

క. నిను మదిలోనం దలపక
జననాథున కభయమును నొ ♦ సంగినవానిన్
హనుమని జెండాడగ వే
నను బంపింపుము జనిమెద ♦ నగ సమధైర్యా.

రాము — (చిఱునవ్వు నవ్వి) లక్ష్మణా! హనుమంతుడు సామాన్యుండని తలంచితివా?

చ. అనిమొన దేవదానవ స ♦ హస్ర ములొక్కట నెత్తివచ్చినన్
మనమున నించుకైన నను ♦ మానమునొందడు భీతిబూనడా
హనుమడు, శాంకరీధవుని ♦ నంచితి తేజము బూని పుట్టె; ట
య్యనుపమ శౌర విక మము ♦ నందెను నాతనిదాక శక్యమే?

అదియుంగాక యాతడు భవిష్యద్బ్రహ్మయై రాజిల్లును.

లక్ష్మ—అట్లయిన నింక మనము చేయవలసిన కర్తవ్యమేమి?

రాము—ఎవ్వరినైన దూతను నాతనియొద్దకు బంపి యయాతిని విడువుమందము. సాధ్యమైనంతవఱకాతడు నాయాజ్ఞతి దాటువాడుగాడు. అట్లు చేసెనేని తరువాతి సంగతి జూచుకొందము.

సేవ—(ప్రవేశించి) దేవా! కిష్కింధనుండి యంగదుండు దేవరదర్శనార్థమై వచ్చియున్నాడు.

రాము—ఏమీ! అంగదుం డరుదెంచినాడా! శీఘ్రముగ దోడ్కొనిరమ్ము.

[అంగదుడు ప్రవేశించును.

అంగ.—(తనలో) ఇక్కడకు చేరికొంటిని. ఇంక శ్రీ రాముని సందర్శించి హనుమత్సందేశంబును దెల్పెదగాక. రాముడు హనుమంతుని మాటలువిని యయాతిని రక్షించునా. ఉభయపక్షములవారును దమతమ ప్రతినలను వీడువారుకారు. తుదకు సంగరమే యొనగూడునని నాకుదోచుచున్నది. ఈరాముడు మున్ను చెట్టుచాటున డాగి నాజనకుని గూల్చి మహాపాపంబు గట్టుకొన్నాడు. అది యింతవఱకును నాహృదయంబున దగిలియే యున్నది. ఇప్పుడు నిరంతరధర్మవతుండైన యయాతినివంధిప బ్రతిజ్ఞదాల్చినాడు. ఉభయులలో నెవ్వరిప్రతిజ్ఞ నెఱవేఱునో తెలియకున్నది. రామహనుమంతు లిరువురును సామాన్యులని తలంపవలదు. ఇరువురును నవతారపురుషులే సరే నేనియ్యది యాలోచించుచు జాగుసేయనేల? (రాముంజేరి) మహాత్మా! రామచంద్రా! భవదీయపాదపంకేరుహంబుల కీసేవకుండు నమస్కరించుచున్నాడు.

రాము—అంగదా ! శుభమగుగాక. ఇట గూర్చుండుము.

అంగ—(ఆసీనుడగును)

రాము—అంగదా !

శా. సీతాన్వేషణ కార్యయత్నము దగన్ ♦ జేయంగ శీఘ్రంబుగా
బీ ర్తిన్ వానరవర్గముల్ జనిచి పృ ♦ థ్వీపుతి సేమంబునన్
ఖ్యాతిన్ దెచ్చిన భానుసూనుడు లస ♦ ద్గాంర వారాశి; వి
ఖ్యాతపా భవమూర్తి యుండెనుగదా, ♦ భదా నుమోదాత్ముడై.

సీ. నాయాజ్ఞ మౌళిపై ♦ న ధరించి; ముది క
తనహస్తమంద మో ♦ దమునదాల్చె
వానరానీకంబు ♦ పరమహర్షముతోడ
దనవెంటనే తేర ♦ దరలిపోయి
శతయోజనంబౌచు ♦ జాలవిస్తీర్ణమౌ
కంధిని దృటిలోన ♦ గాల్వకరణి
దాటి; నిర్భీతితో ♦ దానవేందు పురంబు
జొచ్చి; సీతాసతి ♦ జూచి; మరలి
తే. గీ. వచ్చుచో రావణాత్మజు ♦ బవరమందు
మహిత దర్పము బేర్చి దు ♦ స్సాడి; నాకు
జానకివార్త వినుపించి ♦ సంతసంబు
గలుగ జేసిన మారుతి ♦ చెలగుచున్న
వాడె, కుశలియె, కోర్కెలై ♦ బలుకుమయ .

అంగ—దేవరకటాక్షంబున నందఱును సేమంబుగనున్నారు.

రాము—సరే. నీవిచ్చోటి కరుదెంచిన కార్యమేమి?

అంగ—

తే. గీ. ధరణిభారమునకు నవ ♦ తారమెత్తి
నట్ట పుణ్యమూర్తివి ♦ నీకు నవనియందు

దెలియనట్టివి గలుగునే ♦ తెలిసియుండి
నాదునోటను వినగోరి ♦ యడుగుచుంటి
వనుచు దలపోయుచుంటిని ♦ నాత్మయందు.

దేవా! నీ వడిగితివి కాన చెప్పెదను. విశ్వామిత్ర ప్రేరేపణంబున నీవు యయాతిని వధింతునని ప్రతిజ్ఞ సేయగా నాతండు హనుమంతుని జేరి శరణమందగా దెలియక యాతండభయంబు నొసంగినాడు. పిదప బశ్చాత్తాపమందినాడు.

రాము—హనుమంతుడు యయాతికి నభయమిచ్చిన సంగతి మేమిది వఱకే వినియున్నాము. తెలియకనే యట్లు గావించెనని తలంచితిని. సరే. జరిగినదానికేమి! ఇప్పుడాతండు యయాతిని నా కప్పగించు తలంపునందే యున్నాడని తలంచెదను.

అంగ—దేవా! నీకు దెలియని ధర్మంబు లెచ్చటగలవు. అభయమిచ్చి మరల విడుచుట యధర్మముగాదా!

రాము—అట్లనా! ఇప్పు డాహనుమంతుని సందేశమేమని?

అంగ—దేవా! అవధరింపుము.

సీ. రాతి నాతిగ జేయు ♦ రమణీయమైన ప
దాంబుజంబులకు దం ♦ డంబులనియె
గాధేయుమాటపై ♦ కలుషమింతయు లేని
పుడమిఱేను జంపుట ♦ బోలదనియె
ప్రతిన జేసితివన్న ♦ మాటయే యెఱుగక
యభయమిచ్చితిని, య ♦ యాతికనియె
పుణ్యావతారి ♦ భూపాలచంద్రుండు
గావున రక్షించి ♦ కాలుమనియె
తే. గీ. నెట్టికార్యము చేయంగ ♦ నెంచియున్న
చేతగానిది లేదంచు ♦ జెప్పుమనియె

నీవు నామీద జూపిన ♦ నిక్కమైన
కరుణ యెట్టివేళలనైన ♦ మఱువననియె.

రాము—అంగదా! ఆతని సందేశము వింటెని. యయాతిని రక్షించిన చో నాప్రతిజ్ఞకు భంగము గలుగదా? అదియాతం డాలోచించినవాడు కాడే? నేనందుల కంగీరింపజాలను. కావున ముందు కర్తవ్యమేమి?

అంగ—దేవా! అది నీకు దెలిసియేయున్నది.

లక్ష్మ—అన్నయ్యా! అది నేనింతకుపూర్వము చెప్పలేదా?

రాము—యుద్ధమను సంగతియే.

అంగ—అట్లనియే హనుమంతుడు మీతో విన్నవింపుమనియెను.

లక్ష్మ—వింటివిగదా! అగ జా! ఇంక నాలోచింపబనిలేదు.

రాము— అంగదా! హనుమంతుండు యయాతిని విడువడా!

అంగ—అధర్మమైనకార్యము నాత డెట్లుసేయును.

రాము—అట్లయిన నీవేగి, యాహనుమంతుని మైత్రి నంతయు మఱచి యయాతి సంరక్షణమునకై ధైర్యమునుబూని, రణమున నిలువుమని చెప్పుము.

అంగ—చిత్తము. (నిష్క్రమించును.)

రాము—హనుమంతునితో మనకు సమరము తప్పదు. కానిము ఇది యెట్లు పరిణమించునో చూతము రమ్ము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము.



శ్రీ

# హనుమద్రామ సంగ్రామము

## షష్ఠాంకము.

### కిష్కింధయందలి బయలు.

[ప్రవేశము—యయాతి సమేతముగా హనుమత్సుగ్రీవులు.]

హను—ఆహా! సుగ్రీవా!

సీ. ఎవ్వాని ముఖబింబ ♦ మీక్షించుటం జేసి
మదిలోనఁ జింతల ♦ బాసినాము
యెవ్వాని నామంబు ♦ నేవేళ స్మరియింప
సకలపాపంబులు ♦ సమసిపోవు
యెవ్వాని కృపచేత ♦ నెల్లజగములందు
ఘనకీర్తితోడను ♦ గ్రాలినాము
యెవ్వాని దయచేత ♦ నింతప్రభావంబు
గలిగి శూరులమౌచుఁ ♦ జెలఁగినాము

తే. గీ. యెవనిదైవంబుగా నెంచి ♦ యెల్లవేళ
లందు మనమునందున నిల్పి ♦ యలరినాము
యట్టి రఘుపుంగవుండు మన ♦ కయ్యెవైరి
నేఁటి కీయయాతి పుడమి ♦ నేతకతన.

(యయాతిఁ జూచి) ఓయయాతి నృపాలా! నీవు నన్నెంతయు మోసపుచ్చితివిగదా? పరమబాంధవులకంటె నెక్కుడు బంధుఁడై, దైవంబులకు దైవంబై, నిరంతరమును మాసేమంబును విచారిం

చుచు, మాబలశౌర్యంబులకుఁ గారణభూతుండైన రాముఁడు నీమూలంబున నేఁడు విరోధియయ్యెను గదా! నీమూలంబున నాతనితో నేఁడు బోరాడవలసి వచ్చినది. ఇట్లగునని యెన్నఁడును గలనైనం దలంపనైతిని. (విచారించుచున్నాఁడు)

యయా—(తనలో) ఆహా! ఈహనుమంతుండు తొలుత నాకభయం బొసంగి, యిప్పుడు శ్రీ రాముండు తనపైకి లక్ష్మణ యుతుండై యెత్తి వచ్చుట జూచి మనంబున భీతిల్లియో, లేక యేకారణంబుచేతనో కాని, యిట్లు సందియమందుచున్నాఁడు. ఇప్పుడీతండు రామునకు భయమంది నన్నాతని కప్పగింపఁడు గదా? ఏమోకాని నాడెందంబున భయంబుఁ గలుగుచున్నది. అయినను నీతనితో నిట్లు పలికి చూచెద. (ప్రకాశముగా) మాన్యచరితా హనుమంతా! నేను భయమంది శరణమందితిని. నీవును నాయందుఁ గృపాంతరంగుడవై యభయమిచ్చితివి. దానంజేసి నేను ధైర్యచిత్తుండనై మెలంగుచుంటిని. ఇప్పుడు నీముఖంబుఁ జూడగా నీచిత్తం బదియొకతీరుగ నున్నట్లున్నది. శ్రీ రాముఁడు సౌమిత్రీ సమేతంబుగా నరుదెంచుట జూచి నీవు భయంబందియో, లేక రామునియందున్న భక్తి కారణంబుచేతనో నన్నాతని కప్పగించెదవేమో యని భయము గలుగుచున్నది. అట్టిదేదైననున్నచో నాకిప్పుడే చెప్పుము. నీవు నన్నాతని కప్పగించునంత యవసరములేకుండ నేనే యాతని యెదుటకేగి చేతనైనచో రణంబొనర్చెదను. లేకున్నచో నతని హస్తంబున మరణమంది వీరస్వర్గము నందెదను. నీవు నన్నాతని కప్పగించితివని నేను చింతింపనుగాని, బలపరాక్రమసంపన్నుఁడును, శరణాగతత్రాణ బిరుదాంకితుండును నగు హనుమంతుఁ డీరీతి నభయమిచ్చి మరల విడనాడెనని మాత్రము చింతించెదను.

నీవట్లాచరింపఁ దలంపక నన్ను రక్షింపవలెనని యుద్దేశముతో డనే యున్నయెడల, శౌర్యసాహసంబులఁ బూని సంగామం బున నిలచి నన్ను రక్షించి చతుర్దశ భువనంబుల యందును నీయశశ్చంద్రికలను వెలయింపుము.

హను—భూపాలా! నీవు నావిషయమై సందియమంది భయమునొం దకుము. నాకంఠమునఁ బాణంబున్నంతవఱకును నాభుజబల పరిరక్షితుండవై నిన్నెవ్వరులు దాఁక జాలరు. శరణమందినవారిని రక్షించుటకుఁ గంకణము ధరించియున్న నేను రామునకు భీతి ల్లి నిన్నాతని వప్పగింతునని కలనైనను మనంబునఁ దలంప వలదు.

శా. అక్షీణప్రకట ప్రతాపబలశౌ ♦ ర్యంబూనుచున్ వే సహా
సా త్రోదిప ముఖుల్ రఘూద్వహుల ప ♦ క్షంబూనగానిమ్ము లో
కక్షోభంబుగ రామభూవరుని సం ♦ గ్రామంబునం దాకి నిన్
రక్షింతున్ భయమందఁబోకు మిఁకనై ♦ నన్ భూపచూడామణీ.

యయా—ఇప్పటికిఁగదా ధన్యుఁడనైతిని.

హను—యయాతీ! నీవు భయమందక, నావెనుక నుండుము. (సుగ్రీ వునిఁజూచి) సుగ్రీవా! అటుజూడుము. అదిగో రామలక్ష్మణు లుచాపధరులై యిట్లు వచ్చుచున్నారు.

[విశ్వామిత్ర రామలక్ష్మణులు ప్రవేశింతురు.]

రాము—తమ్ముఁడా! హనుమంతునితో మనకుఁ బోరాటంబు దప్పద నను. అదిగో హనుమత్సుగ్రీవులు మనకై యెదురు చూ చుచున్నారు.

హను—(రాముని సమీపించి)

మ. హరి నారాయణ జానకీధవ విచి ♦ త్రాత్యద్భుతాశ్చర్య భా
స్కరకోటిప్రవికాశ సత్ప్రకటరా ♦ కాచంద్ర బింబాననా

సురసంసేవిత పాదపద్మయుగళా ♦ శుద్ధా ! త్రైలోక్య సుం
దర పీతాంబర భక్తపోష! రఘునే ♦ తా! రాజకంఠీరవా.

తే. గీ. ఎవనికృపచేత భూమి; నే ♦ నిరతివాఁడ
నైతి; నెవ్వాని దయచేత ♦ నలఘు మహిమ
మలరుచున్నది నాయందు ♦ నట్టినీకుఁ
బ్రణుతిఁ గావించుచున్నాఁడ ♦ భవ్యచరిత.

(నమస్కరించుచున్నాఁడు.)

సుగ్రీ — తే. శాత వృత్తమైన వాలిని ♦ సమయఁజేసి
భవ్య కిష్కింధ నాకిచ్చి ♦ మహిత కృపను
కన్నబిడ్డ విధంబునఁ ♦ గాచివెలయు
నట్టి నీకు నమస్కార ♦ మనఘమూర్తిఁ.

రాము—సుగ్రీవా ! మనచిరకాల మైత్రి విషయమై నేను విశేషంబుగ నీకు బోధింప నవసరములేదు. అంతయు నీకుఁ దెలిసియే యున్నది. ఈయయాతి విశ్వామిత్రున కేదియో యెగ్గు సలుపుటంజేసి నేనీతనిని వధింతునని ప్రతిఁ బూనినాను. ఈసంగతి దెలియక హనుమంతుం డభయంబొసంగెను. ఇప్పుడు దెలిసినది కావున నతనిని విడుచుట మంచిదని చెప్పుచుంటిని.

హను—.దేవా ! నీవు సమస్త ధర్మాధర్మ సంవేదివి. నీకుఁ దెలియనిదేమున్నది ? అధర్మకార్యంబు నెట్లు సేయఁగలను ? అందుకు నాచిత్తము సమ్మతించునా !

లక్ష్మ—సుగ్రీవా ! నీవైన నియ ది యకార్యమనియు, యయాతిని మాకప్పగింపవలసి నదనియు. నీతనికి బోధింప లేకపోయితివా ?

సుగ్రీ —స్వామితీ ! అయ ది యధర్మ ంగాదా ?

లక్ష్మ— మిదీ ! మహాధ - పరాయణునివలె బలుకుచుంటివే! నీవె త

యుఁ గృతఘ్నుండ వైతివి. నీకు రాముండొనర్చిన మేలంతయు మఱుపునకు వచ్చినదా! ఓరీ సుగ్రీవా! యిటువినుము.

ఉ. వాలియొనర్చు బాధలకు ♦ భావమునన్ సహింపలేక; భూ
పాలుని రామమూర్తిఁ బద ♦ ముల్ గను బట్టుచునాశ యింప; నీ
మేలునుగోరి వాలిని ని ♦ మేషములో ధర ద్రెళ్ళనేసి; త
త్పాలితమైన యీభువికిఁ ♦ బట్టముగట్టుట నాఁడెఱుంగవే?

ఇది మఱచిపోయితివి కాఁబోలు. అదియుంగాక ధర్మమనిపలుకు చుంటివి. అగ్రజుని మరణానంతరంబున నాతనిభార్యయగు తారను గూడిన నీకు మేము సేయుమన్న కార్య మధర్మమా!

సుగ్రీ — మీరు నాకుపకార మాచరించియుండలేదని నేనెన్నఁడును బలుకలేదు. అందులకుఁ గృతజ్ఞుఁడనై యుంటిని. దానింగూర్చి మీరిప్పుడు చెప్పినందువలనఁ బ్రయోజనం బేమున్నది? మీరు చేసిన యుపకారంబులకుఁ బ్రత్యుపకారముగా సీతాన్వేషణం బునకై నేనుబడిన శ్రమమంతయు మీకుఁ దెలిసియేయున్నది. నేనురీ సుత నన్వేషించుటకు హనుమదాదులను బంపకపోయి వచో నీ యగ్రజుని సంగతి యేమైయుండునో మీకే తెలియును.

లక్ష్మ — ఔరా! ఎంతవాఁడవైతివి. కానిమ్ము. నీ గర్వమిప్పుడే గ క్కించెదను.

రాము — సుగ్రీవా! అనవసర ప్రసంగముతో నేమిపనియున్నది యయాతినివిడిచి మనమైత్రికి భంగముగలుగకుండ నొనర్పుము.

సుగ్రీ — దేవా! అదితప్ప మరేకార్యమును మమ్ము సేయుమన్నను జేయుదుము. నీతో యుద్ధముసేయవలయునన్నతలఁపు మాకె న్నటికి లేదు. యయాతి ధర్మవర్తనాచార నిరతుండని నీకుఁ దెలిసియేయున్నది. అట్టిచో ననాయంబుగ నీ గాథేయుని

మాటలువిని యిట్లు సేయుట పాడిగాదు గావున నాతని రక్షింపుము.

రాము—అట్లయిన నేను జేసినప్రతిజ్ఞ విడువుమందువా ?

హను—అభయమునిచ్చి యిప్పుడు యయాతిని విడువుమందురా ?

లక్ష్మ—మీరు యుద్ధమునందే కృతినిశ్చయులై యున్నట్లు గనుపించుచున్నదే.

హను—యయాతివలన నావంతయు దోషంబులేదని యెఱింగి యాతనిని రక్షించినచో యుద్ధమనవసరమే.

లక్ష్మ—(రామునిఁజూచి) అగ్రజా ! వీరి హృదయంబు లెఱింగితివి గదా ! ఇంక నాలోచింపఁబనిలేదు. (రామునిజూచి)

ఉ. అంచితసంతసంబున ర ♦ ణావనిలోపల శౌర్యవృత్తిమై
మించి పరాక మించెదను ♦ మేదినినెల్ల నవానరంబుగా
వించెద; నెల్లదేవతలు ♦ వేడ్కనుబొందగ, నీ యయాతిని
ప్పించెద నీకు నీప తిన ♦ వేగముదీర్చుకొనంగ రాఘవా.

సుగీ వుసిఁజూచి) సుగీ లా !

మ. ఇఁక నీమాటలతోఁబ యోజనము లే ♦ దింతైన యుద్ధంబునన్
బ్రికటపా భన ధైర్య క్తిమెయి ని ♦ ల్వంజూడు మొక్కింత జం
కక; మారాముఁడుజూచుచుండగను వీ ♦ క న్నిన్ను నారానజా
ల కఠోరాహతి దె ళ్లనేసెదను నా ♦ లంబందు తారాప .

సుగీ—లక్ష్మణా ! ఎన్నియైనను బలుకవచ్చునుగాని చేయుటమాత్రము దుర్లభముసుమా ?

తే. గీ. మున్ను రావణునిశక్తిచే ♦ మూర్ఛమునుఁగ
నితఁడు సంజీవిఁదెచ్చి నీ ♦ మతచేత

(హనుమంతునిజూపి)

బ తికియుంటివి ; కాదె నీ ♦ వరబలంబు
ధైర్య మేమూలనుండునో ♦ తలఁపుమయ్య.

కానిమ్ము. నీచేతఁబడి సు క్కుటకు మ్రుక్కుడిరక్కసులని తలంప కుము. రమ్ము. (ఇరువురును రణంబునకు మోహరించి యుద్ధము చేయుచున్నారు

లక్ష్మ— సు నిఁ దప్పఁగా పాఱిపోవుచు) (లక్ష్మణుం డతనిని వెంటాడుచును

రాము—

శా. ఖ్యాతిన్ వాయుజుపక్షముగాని మిగులన్ ♦ గర్వంబునుంబూని మ
ర్త్యాంతప్రాభవమేర్పడన్ మసల సం ♦ గ్రామంబులో బాఁకగా
సంతోషంబునవచ్చి పారుకపివం ♦ శస్వామి వెన్నంటగాఁ
బంతంబూనక నిల్వుమోయి గుణధా ♦ మా ! నీరమూడామణీ.

[తెఱలో

[అగ జునియాజ్ఞ ననుసరించుచున్నాఁడు]

రాము—హనుమంతునిఁ గాంచి హనుమంతా ! ఇటురమ్ము.

హను—(కరంబులుమోడ్చి) దేవా ! ఏమిసెలవు ?

రాము—నీవునాకుఁ బరమభక్తుండవు. నీయెడల నాకెంత ప్రేమయున్నదో నీవే యెఱింగియుంటివి. దానింగూర్చి నేను వ ంపఁవస రము లేదు. నాకపవాద వచ్చినదో నీకపవాద వచ్చినట్లేకదా? అట్టియెడల నేను జంపుమనన్న యయాతికి నీ నభయమిచ్చుట దగునా ?

హను—దేవా ! నే నది తెలియక చేసితిని. పిదప బశ్చాత్తాపమందితిని.

రాము—ఇప్పుడు తెలిసినది గావున నిఁక నతనిని విడువుము.

హను—అభయమిచ్చి మరల విడుచుట ధర్మమైనకార్యమా ? దేవా!
నీకుఁ దెలియని పరమధర్మంబు లీజగంబున లేవు. నేని ప్పుడి
నీచకార్యము జేసితి నేని లోకులు నన్నతినీచదృష్టితోఁ జూచె
దరు. నాయూ ) తీరుగ విముక్తినిబొందనటువంటి నరకకూప
మునఁ బడగలను. ఇట్టి యకార్యమును జేయుమని నన్ను
బ్రోత్సాహపఱుప నీకుఁదగునా?

రామ—తెలియక చేసితివి కావున నతనిని విడువవచ్చును.

హను—మహానుభావా! నీవెంత చెప్పినను నాచిత్తం బధర్మోద్యోగంబు
నకు సమ్మతింపదు. ఈ యయాతినృపాలునిచరిత్రం బంతయు
నీవెఱింగియేయుంటివి. ఇతఁడు ధర్మస్వభావుండుగాని దుష్టచరి
తుఁడుగాడు. ఈకోపస్వభావుండైన విశ్వామిత్రుఁడు మును
గదన్ను బూజింపలేదని కోపమూని యున్నవి రెండును, లేనివి
రెండును గల్పించి నీతోఁ గొండెంబులను బల్కఁగా నీవు నమి
యీతనిని వధించుటకుఁ బ్రతిజ్ఞబూనితివి. ఇయ్యది నీవుచేయ
వలసిన కార్యముకాదు. కావున నాయందుంచు కృపచేత
నను, యయాతిని రక్షించి, త్రిలోకఖ్యాతిఁ గాంచుము.

విశ్వా—(కోపముతో) ఏమీ! హనుమంతా! నీవు మమ్ముగూడ
ఃకరించుచుఁ బలుకుచుంటివే!

హను—గాధేయా! ఇందు ధిఃకరించుటయేమున్నది. నీసంగతి యెవ
రికిఁ దెలియదు. నీవు సహజకోపస్వభావుండవు. ఒకరిబాగోర్వవు

రాము—హనుమా! పెద్దలను దిరస్కరించుట నీకుఁ దగదుసుమా!

హను—ఇందు తిరస్కార మేమియును లేదు. ఉన్నదున్నట్లు వచించితిని.

రాము—సరియే. ఇప్పుడది యాతయు నేల? యయాతిని విడిచెద
వా లేదా?

హను—అది తప్ప నీవేది యాజ్ఞయిచ్చిను జేయుదును.

రాము—నీవు నాతో యుద్ధముసేయుటకే నిశ్చయించితివా ?

హను—నీవు నన్నుఁ జూచియైన యయాతిని రక్షింపకపోయినచో న య్యదియే నిశ్చయము.

రాము—ఔరా ! హనుమంతా !

తే. గీ. పరమభక్తుండ వంచును ♦ భావమందుఁ
దలఁచితినిగాని యీరీతి ♦ దలఁపనైతి
పామునకుఁ బాలువోసిన ♦ భంగియయ్యె
భవ్యభవదీయ మైత్రి హా ♦ న్మంత యిపుడు.

ఇంత కృతఘ్నుండవని యెన్నఁడు నెంచలేదే.

హను—దేవా ! నేను నీతో యు ముసేయవలయునన్న తలంపెప్పుడును బూనియున్నవాఁడను గాను. ఇయ్యది కాలగతినిఁ బట్టివచ్చినది. మున్ను నీవు సీతంగోల్పోయి యరణ్యంబులఁబడిచరించుచు ఋష్యమూకంబున కరుదేర, మీకును సుగ్రీవునకును నేనే కదా మైత్రి పాటించితిని సీతాన్వేషణంబునకై మరియొక్కరి క శక్యమైన యంభోరాశిని దరించి నేనేకదా లంకఁజొచ్చి, సీతా మహాదేవిఁగాంచి మరలివచ్చి యామెవార్తందెలిపి మనువంశంబును నిలఁబెట్టితిని. సంగరంబున రావణునిశక్తిచే మూర్ఛమునింగిన లక్ష్మణుని బ తికించుటకై నేనేకదా సంజీవిఁదెచ్చితిని. కరుణఁ గోరియేకదా నేనింత శ్రమపడితిని. అట్టిచో నేను నీతో నిష్కారణవైరంబు బెట్టుకొందునా ! అట్లెన్నటికినిఁ దలంపకుము. ఇప్పుడైనను నీకృపాబలంబె యూఁతగాఁగైకొని, యయాతిని రక్షించెదను.

రాము—మారుతీ ! ఒకవేళ నీవు శంకరవరంబున జ యించినాఁడను గదా ! నాకేమి భయంబని తలంచి గర్వించియుంటివేమో నాప తి దీరుకొనుటకై నిన్ను విడుచువాఁడనుగాను.

[పరమేశ్వరుఁడు ప్రవేశించుచున్నాఁడు]
(అందఱును నమస్కరింతురు.)

పర—రామా! భక్తునితోఁ గయ్యంబునకుఁ గడఁగితివా?

రాము—పరమేశ్వరా! సమస్తంబు నెఱింగియుండియు నిట్లనెదవేల

పర—గతించినదానికేమి? విశ్వామిత్రుఁడు తాను జేసిన ప్రతినదా[illegible] వకులుకొనుచున్నాఁడు. కావున యయాతి సంరక్షణ నీకవశ్యము కర్తవ్యమైయున్నది. దీనంజేసి నీకు ధర్మహాని లేదు.

రాము—ఆ ననుసరించెదఁగాక! (యయాతింజూచి) యయాతీ! ఇటు రమ్ము. భయంబుఁబాయుము.

యయా—(రామునకు నమస్కరించును.)

రాము—హనుమా! కాలగతిసిబట్టి యీస్వల్పకలహంబు మానకుఁ గలిగినది. ఇయ్యది నీవిఁక మఱచిపొమ్ము.

హను—

శా. దేవస్త్వచ్చరితు నిన్నును మదాం ♦ ధీభూతచిత్తుండనై
భావింపంగను లేక జన్యమున భూ ♦ పాలాగ్రణిఁగావఁగా
నీవైరంబుదలంచి గర్వినయి నే ♦ నిష్ఠుర్లనిక్ దాఁకి యే
మేమోభాషల నాడినాఁడ నిఁకఁ దం ♦ డీ నన్ను మన్నింపవే.

(నమస్కరించును

రాము—హనుమా! లెమ్ము లెమ్ము.

తే. గీ. మద్యశమువృ బొందింప ♦ మదిఁదలంచి
యీయయాతి నభయంబు ♦ నిచ్చినావ
టంచు మాకు సంబంధుఁ ద ♦ లంచువాఁడ
వితతవిద్యాప్రసాద! మా ♦ రుతికుమార.

*సాంగతిం బట్టి వచ్చినదానికిఁ జింతిపకుము.

శ్రీ—(హనుమంతునిజూచి)

హరకారుణ్య వరప్ర భూతుఁడవు వే ♦ దాంతార్థ విజ్ఞానశా
స్త్రరహస్యాగమ వేది వారధిఁ; దప ♦ స్సద్భవ్యమూర్తిన్ రామస
చ్చరణాంభ్రరుహచింతనారతుఁడవై ♦ శ్వర్య ప్రభావుండవున్
సరిమేవారలు నీకు భూతలములో ♦ నన్ ! శ్రీమయున్నందనా.

హనుమంతా— మీకిప్పుడు నీపోరాటంబు గల్గించి కారణంబనూ యకాదు. మీయిరువురిచిత్తంబుల నరయఁదలంచి యిట్లు చేసితిని. రాముని యందున్న నీభక్తి వర్ణనాతీతంబని నాకిప్పుడు దెలిసినది.

ము— హనుమా ! యయాతి రక్షింపఁబడెను. ఇంక నీకేమి కావలయును.

హ— నీకటాక్షమెప్పుడును నాపైనుండుటయే నాకోరిక. మరియు నిట్లగుఁగాక !

మంగళమహా శ్రీ శ్రీ శ్రీ .

భూతలమున జలు ♦ భూరిసుఖముల్ కనుచు
బుణ్యాత్ములై వెలయుఁగాతన్
నీతముగవర్షములు ♦ నేలబడగా నెప్రుడు
సింధుఫలమీయుత పొలంబుల్
ఖ్యాతిగనురాజు నెడఁ ♦ గాంచుత జనంబులతి
గౌరవము భక్తి ననిశంబున్
జేతయును ధర్మగతి ♦ నిద్దోలగకన్ పుడమి
నిన్ సతము నేలుత తతిర్త్కిన్.

ఇది షష్ఠాంకము
సంపూర్ణము.

చదివితీరవలయును !                                  కొనితీరవలయును !!

# వేశ్యామధురం 1 వ భాగము.



రెండవకూర్పు, కొన్ని ప్రతులుమాత్ర మేగలవు వెల 1-0-0.

ఇందు వేశ్యల మాయోపాయములు, వేశ్యలకై విటులుపడు పాట్లు, వారు పడు పరితాపము, మొదలగునవి కలిగి మొదటినుండి తుదవరకును కడుపుబ్బనవ్వుపుట్టించును. ఇట్టిదిమున్నెవ్వరిచేతను రచింపబడి యుండలేదు. కథాసందర్భముగ ఇందు వచ్చు బాతాఖానీ సుబ్బరామయ్య పంతులు ఫార్సు, పూటకూళ్ళ పిచ్చియొక్క తాలూడి తమాషాలు, హోటల్సులోని అల్లరులు, సత్రములలోని గడిలు డాక్టరు కొండయ్యనాయుడు వైద్యము, వెంకటేశ్వరరావుగారి సరసుడు పడినకష్టములు, విటశేఖరులకు వేశ్యల సంతన త్యాగితా నయనంబులవలన కలిగిన లాభములు. మెస్సీలను వేశ్యయొ మాయలు, పోలీస్ ఇనస్పెక్టరు ముకుందరావు జమాను ఇబర్ సాహేబ్ యొక్క సంభాషణయు, తిరువెంగళమ్మయను వైష్ణవ చిదాని వభిచారము, జంగం నాగలింగం, కంసాలి వీరయ్య, రామానుజచార్యులు, రామన్న పంతులు, చినరాజు సెట్టి యొక్క పాట్లు, నాటకములలో వేషములువేయు వారిచర్యలు, కవీశ్వరులయొక్క పోట్లా మొదలగునవి చదివినయెడల, తప్పక కడుపుబ్బ నవ్వు పుట్టకమానదు. దీనియందు ముఖ్యముగా, సరసులను సానులు యెట్లు మోసపుచ్చుదిన్నీ, సానులను సరసులెట్టి దగాచేయునదిన్నీ, చక్కగా వివరింపబడి యున్నది. వేశ్యలకు కూడా నుపయోగించు రీతిని చక్కనిజావళీ పాటలు, పద్యములు జేర్చబడియున్నది. ఇందలి భాషను నియమ సరింపక యథేచ్ఛముగా వ్రాయబడుటచే యందరికిని సులభముగ తెలియును. వేయేల ఈగ్రంథమును వేశ్యలుగాని విటశేఖరులు చదివినయడల తప్పక సన్మార్గ ప్రవర్తులగుటకు సందేహములేదు.

శ్రీ ...న ఆంధ్ర భాషానిలయము

_1125, నాంపల్లి, హైదరాబాదు.

★ ★ ★

# ర్వ సభ్య సభ

ది 3_3_1980 ఆదివారం ఉదయం 9 గంటలకు నిలయమందిరము ... సర్వసభ్య సమావేశమగును గాన సభ్యులందరు సకాలమునకు ... య ... ర్థితులు.

సభ్యులు ... సూచనలు చేయదలచిన యెడల వాటిని వ్రాతపూర్వకముగా ... 1980 లోగా పంపగోరుచున్నాను.

కార ని ... వర్గమునకు పోటీ చేయదలచుకొన్న సభ్యులు వారి అభ్య ... వ్రాతపూర్వకముగ 15_3_1980 లోగా కార్యదర్శికి పంప... ను.

ఇట్లు

బి. యం. కృష్ణమూర్తి

గౌరవ కార్యదర్శి

(తిప్పిచూడుడు)